[illegible]

# నా ప్రభూ!

(శ్రీ యాదగిరి లక్ష్మీ నృసింహ శతకము)




రచయిత

శాస్త్రేటి నృసింహ శర్మ.

విశిష్ట ఆంధ్రోపాధ్యాయులు.

హనుమకొండ

# అంకితము

★

శా॥ మాన్యుల్మెచ్చగ, చంపకోత్పల లస
న్మత్తేభ వృత్తాదుల
న్విన్యాసంబొనరించి, వృత్తరచనా
విభ్రాంతి, నీ కబ్బపు
న్గన్యారత్నము ధారవోసితిని, స్వీ
కారంబుగావించి, వా
గ్ధన్యుంజేయుము, వాసవాది సురమూ
ర్ధన్యా! నృసింహాప్రభూ!

— గ్రంథకర్త.

అసతో మాసద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ

# మున్నుడి

★

కారణాంతరములచే నాయుత్తర జీవిత ఘట్టము పెక్కు చిక్కులకు లోనయ్యెను. నూత్నసంసారము నడుపఁబూనిన నేను స్థిరప్రదేశము, స్థిరవాసము కూర్చుకొనఁదలఁచితిని. హన్మకొండకు మార్పుజేసి డా॥ వామనరావు డాయిరెక్టరు గారు మొదటికోరికను పూర్తిజేసిరి. ఇఁక వాస మొండు సమకూర్చుకొను విచారణము సేయుచుంటిని. 11 నవంబరు 1956 రోజు శ్రీమాన్ తంయ్యాల రంగాచార్యులు M. A. B. Ed. గారు తమ నూతన గృహ ప్రవేశమునకు నన్నాహ్వానించిరి. అప్పట్ల వసతి ప్రాముఖ్యమును గూర్చిన నా యూహలను పద్యములం దిమిడించితిని. గృహవసతికై నామనంబెంత ఆందోళన పడినదో పాఠకలోకమునకు పరిచయము కొఱకు నా పద్యములిందు పొందు పఱచుచున్నాను.

క॥ "గ్రాసం బన్యులదైనను
వాసము తనదంచునుండ – వలె"నందు్రి బుధుల్
వాసములేమికి కర్మ
వ్యాసంగము క్షీణదశకు – వచ్చును గాన ॥

క॥ భువనములో నందఱకున్
భవనము లావశ్యకములు – భవబంధనము
ధ్రువహర్షామర్షమహో
త్సవముల స్వేచ్ఛానురీతి – సాగించుటకై ॥

క॥ హవనమ్ములను, సపనములను
అవిరళ జపహోమ దేవ – తార్చనవిధులం
దవిలి యొనరింప నేతో్ర
త్సవముగ కావలెను స్వీయ – సౌధంబొందున్ ॥

క॥ అతిథుల నభ్యాగతులను
సతతాగను బంధుకోటి – శరణాగతులన్

కుతుకమున నాదరింపగ
ప్రీతి గృహమేధికిని నవన – రంబు గృహంబుల్

క॥ పిల్లలు స్వేచ్ఛగనాడఁగ
ఇల్లాలి మనోభిలాష – లీడేరంగన్
ఎల్ల సుఖంబులకును, పు
ట్టిల్లగు నిల్లొకటి వలయు – నీ దేహాలకున్ ॥

తే॥ గీ॥ క్రొత్తయింట పదములిడు – కొనెడువేళ
కవులనందఱ నొకట సం – ఘటన పఱచి
వారలిడు పద్యపుష్పోప – హారగౌర
వంబు వెదజల్లితివి నూత్న – భవనమందు ॥

సీ॥ మంగళదేవత – రంగార్య మీయింట
సతతంబు నృత్యంబు – సలుపుగాత,
శారద మీయింట – సాహిత్యమంజీర
నిక్వాణనము మ్రోగ – నిలుచుగాత
సర్వమంగళ మహో – త్సాహంబుతోడ, వ
ర్తించుత చలువపం – దిళ్ళ లోన
అన్నపూర్ణాదేవి – యనవరతము, మహో
నసగృహాంతరమున – నుసలుగాత

తే॥ గీ॥ ఆ మనోజయుకాంత జ – యాంకమైన
పచ్చతోరణాల్ నీద్వార – బంధములను
వ్రేలగట్టుచు నవిరతి – వెలయుచుండ
ప్రగతి గనుము రంగాచార్య! – సుగుణధుర్య!

నా యీ యాందోళనను దీర్ప సంగీత విశారదుఁడగు శ్రీ ముచికుందము గారు పూనుకొనిరి. 8-3-'57 న భూమి కొనిపెట్టి శ్రమకోర్చి గృహనిర్మాణమును గావింపఁజేసి 7-6-'57 న నూతన గృహమున ప్రవేశింపఁజేసిరి. ఇట్లు వారిపరిశ్రమ వల్ల నేనిల్లు కలవాఁడనైతిని, ఆనాటిస్థితిని పద్యరూపమున నిట్లు చెప్పుకొన్నాను.

మ॥ భవనంబొందిలగట్టి; దాన బుణదు
ర్బంధంబులోఁజిక్కి, బై
రవమౌ రౌరవబాధలందుచును, దీ
ర్ఘా శక్తిసామర్థ్యముల్
అవకాశంబులు లేమి చింతిలుదు పూ
ర్వోన్నత్యముం దల్పుచున్
అవమానంబు ఘటింపఁజేయకుము దే
వా! శ్రీనృసింహప్రభూ!

చ॥ ఘటమున కొక్కటుండవలె
గా మతమంత్రుడు బుధుల్; తదుక్తి సం
ఘటననిమిత్త మారసితి
కాటికి కాళ్ళనుచాచునాడు వి
స్ఫుటముగ యత్నమున్సలిపి
పొంది తలంబు గృహంబుగట్టితి
న్నట పగభాగమయ్యెడియు
నర్థమనర్థముగా నృకేసరీ!

మ॥ ముచికుందుం డుపకారసంఘటన సం
పూర్ణుం డుపాధ్యాయుఁడున్
ఉచితజ్ఞుండు మదీపి తానుచరుఁడై
యుత్సాహముంగొల్పి ని
ర్వచనీయశ్రమకోర్చి; నిల్చి గృహని
ర్మాణంబుఁ గావించె, కూ
రుచుమా యాదగిరీంద్ర! యాతనికి నా
రోగ్యాది సత్సంపదల్॥

ఉ॥ ఆయ్యెడ నిల్లుకట్టుటకు
నై ముచికుందుఁడు తానెఱుంగు మ
ల్లయ్యసుతారినిం గొలత
యైన పదంపడి కూలినిచ్చు న

ట్టియ్యకొనంగఁజేసె, యటు
లే యొకపక్షములోపలం దయా
రయ్యె గృహంబు దబ్బకరు
వయ్యెను యాదగిరీంద్ర! మత్ప్రభూ!

ఉ॥ అంత మదీయమానసము
నం దుదయించెను నీదు దర్శనా
నంతరమే వినూత్నభవ
నంబున జేరుతలంపు నట్లె య
త్యంత ప్రపత్తి నీపదము
లంటితి నిల్చితి నింటివేల్పుగా
ముంతువొ తేల్తువో బుణవి
ముక్తుని జేసెదవో నృకేసరీ!

ఆనాడు ఆకువుగా శ్రీ రాజకవి చూడామణి ఉదయరాజు శేషగిరిరావు, M. A. ఆశీర్వచనమిట్లిడిరి.

ఉ॥ శ్రీరమణీమనోహరుఁ డ
శేషకృపానిధి, వారిరాశిగం
భీరుఁడు భక్తపాలకుఁడు
వేడుకతోడ భవన్నివాసముల్
సార శుభాతిరేక బహు
సంపదలన్ ధనధాన్యభోగ వి
స్తార యశస్సమేతమయి
తద్దయు పెంపొనరించు గావుతన్ ॥

చ॥ గుణనికరం బుదారఖని
కోమలచిత్తసరోరుహంబు ధీ
మణి సదయావతంసుఁడు స
మంజసకార్యకలాపదక్షతా
గణిత మహాయశోంచితుఁడు
గానకళాజనమాన్యపండితా

గర్గిణి ముదికుందుసాయమున
గాదె గృహస్థుఁడవైతి మిత్రమా !

శా॥ శాంతాఖ్యన్ జెలువారు గేహిని వివా
సంబొంట నీ గేహమున్
శాంతిస్థానముగా నెసంగుటను శ
శ్వత్పుణ్యసంజాతపున్
సంతానంబు రవీంద్రనామమయి పా
శస్త్యంబుబూనన్ బళీ !
యెంతో శాంతికుటీరమై యెసఁగె నీ
యిల్లో నృసింహాభిధా !

మ॥ లలితానామమొకందుదాల్చి పిదపన్
లక్ష్మీసమాఖ్యాకయై
చెలువొప్పారెడు ముద్దుబిడ్డ యివటన్
స్వేచ్ఛావిహారంబుతో
కలిమిన్ దీర్ఘతరాయువుంగలిగి నీ
కాంక్షానుసారంబు ని
స్తులతానందముగూర్చు శాంభవి కృపన్
చొల్లేటి కవ్యగ్రిణీ !

సీ॥ స్వీయ నిర్మితగేహ — సీమలోనివసించి
వర్షత్రయముబోధ — పఱుపుమయ్య
పదవీ విరమణంబు — ప్రాపించి యాంధ్రభా
షామతల్లికి సేవ - సలుపుమయ్య
నితతంబుభక్తిత — త్పరతతో నిల్లాలు
కొలువగా సుఖముల — మెలఁగుమయ్య !
పుత్రపౌత్రసమృద్ధి — పొలుపొంద సకల సం
పదలతో సతతంబు — వరలుమయ్య !

తే॥ గీ॥ సత్య ధర్మ నిరతికొనన - సాగునటులు
నలుగురు నుతింప ఋజుగతి - నడువుమయ్య
యాదగిరి నృసింహావిభుఁ - డనవరతము
ఓ ! నృసింహకవీంద్ర ! ని - న్నోముమయ్య

ఆ వెనక జీతంబంతయు ఋణదాత కిచ్చుచుంటిని. తిండికై దేవరొప్పుల, గొట్టిపర్తి శిష్య వర్గము తగు తండులము లంపెను. దిన వెచ్చమునకు మతస్థులు తమ పాఠశాలలకై కొని ఆర్థిక సహాయ మొనర్చిరి. వారికి కృతజ్ఞుడను. స్మృతిపథ మందున్నవారి దివ్యనామములివి. మాదాకు జెందిన ఆప్తులకు జోతలు.

1– శ్రీ సుబ్బారావు, B. A. B. Ed. H. M. హన్మకొండ
2– శ్రీ రంగారావు, ,, ,, ,,
3– శ్రీ హనుమాల కనుకయ్య, S. P. M. P. H. ,,
4– శ్రీ పెబ్బోజుల రామనాథం, M. A. B. Ed. లెక్చరర్ హన్మకొండ
5– ప్రాక్టిసింగ్ మిడిల్ స్కూలు విద్యార్థులు హన్మకొండ
6– శ్రీ అప్పారావు B. A. B. Ed. H. M. హన్మకొండ
7– శ్రీ ఖాదరుపలీ, Asst. G. P. M. S. హన్మకొండ
8– శ్రీ బురహానొద్దీన్, Asst. H. S. L. హన్మకొండ
9– శ్రీ శ్రీరాముల లక్ష్మీనారాయణ, B. A. B. Ed. H. M. మట్టెవాడ
10– శ్రీ కొంపెల్లి భీమశంకరం, P. S. మట్టెవాడ
11– శ్రీ గార్లపాటి రాఘవరెడ్డి, Asst. M. H. S. మట్టెవాడ
12– శ్రీ చినలక్ష్మయ్య, H. M. నయీంనగర్
13– శ్రీ కంయాల రంగాచారి, M. A, B. Ed. H. M. హసనాపర్తి
14– శ్రీ ఆనందరావు, పోలీసు ఇన్స్పెక్టర్
15– శ్రీ గంగు రాజయ్య, నవాబుపేట
16– శ్రీ రంగనాథస్వామి, H. M. జాసిత్‌నగర్
17– శ్రీ యం. సత్యనారాయణ, B. A. దేవరొప్పుల
18– శ్రీ దప్పుల లక్ష్మీనర్సయ్య, దేవరొప్పుల
19– శ్రీ పేర్వారం జగన్నాథం, M. A. జిల్లా షాహపురము
20– శ్రీ కె. రాజేశ్వరరావు, Asst. G. P. M. S. హన్మకొండ
21– శ్రీ నెల్లుట్ల రంగారావు, పట్వారి గొట్టిపర్తి
22– శ్రీ కేతిరెడ్డి వెంకటరెడ్డి దేశముఖ్ గొట్టిపర్తి
23– శ్రీ కేతిరెడ్డి పురుషోత్తమరెడ్డి దేశముఖ్ గొట్టిపర్తి
24– శ్రీమతి పుష్పమ్మ, కవయిత్రి సంస్కృత విశారద (శిష్యురాలు) గొట్టిపర్తి
25– శ్రీ రావులపల్లి నారసింహారెడ్డి దేశముఖ్ గొట్టిపర్తి

26– శ్రీ రాఘవరావు, B. A. Asst. G. P. M. S. హన్మకొండ
27– శ్రీ నారాయణస్వామి, B. A. Asst. హన్మకొండ
28– శ్రీ ముద్దు రామకృష్ణయ్య, B. A. B. Ed. ప్రి॥ ప్రె॥ కా॥ హన్మకొండ
29– శ్రీ త్రిపురారి రామకృష్ణ సిద్ధాంతి నవాబుపేట
30– శ్రీ టి. నర్సయ్య, B. A. B Ed. H M. G. P. M. S. హన్మకొండ

ఈశ్వరుడు వీరి కైశ్వర్యము లిడుగాత– ఇట్లు 8 నెలలు ఋణవిముక్తుడనై కాలము గడుపుచుండ.

శా॥ రోగగ్రస్తుఁడనైతి పూర్ణముగ నా
రోగ్యంబు చేకూరదే
దాగారంబున కూపనిర్మితికినై
యర్థంబు వెచ్చించుటన్
వాగర్థంబులు నన్నుగిల్లె రచనా
వ్యాపారముండుల్లె ను
ద్యోగంబా చరమస్థితింబడెను న
న్నోదార్చుమా మత్ప్రభూ !

అర్థమనర్థముగానున్న నింటియందొక గదిని మే 58 లో నిర్మింప ప్రారంభించితిని అయ్యది.

ఉ॥ క్లిష్ట సమస్యగానిలచి
కేలువిడల్చుచునుండ చూచి నా
కష్టములెంచి యొక్కగది
గట్టగ తావినిబెట్టి తా నుప
ద్రష్టగనుండి తోడుపడె
ధన్యుఁడు నిమ్మడి వెంకటేశ్వరుం
డష్టవిభూతులన్నొసగి
నాతని సాకుము శ్రీశ ! మత్ప్రభూ !

ఉ॥ నిరుపమ శాంతమూర్తి జన
నీజనకానతిపాలనాధురం
ధరుడు మదీయగేహమున
దక్షిణపుం గదిగట్టజేసె బం

ధుర కృపనిల్చి వేసవిని
　　　　తోడుగ యిమ్మడిశెట్టి వెంకటే
శ్వరుఁడు నిగర్వి యాతని క
　　　　పారసుసంపద లిమ్ము మత్ప్రభూ !

చ॥ ఆతనికి తోడుగా నిలిచె
　　　　నాదర మొప్పఁగ నన్ను జూచు సం
తతమును చక్రిపాణి గణి
　　　　తజ్ఞుఁడు తజ్ఞుఁడు నిజ్ఞుఁడుగా జగ
ద్ధితుఁడగు శ్రీహరీ యఖిదు
　　　　డింగితుఁ డాతని బ్రోవుమా సదా
హితరణశక్తినిచ్చి కడు
　　　　వేడుక సంపదలిచ్చి మత్ప్రభూ !

ఆ వెనక 1960 లో పెన్షన్‌పై పోనుంటిని. ఇల్లు నిర్మాణము పూర్తికాకుండ నుండి ఆవేదనపడుచు—

ఉ॥ వంచనజేసి కట్టడము
　　　　పంపుల పుట్టగ సల్పి మధ్యలో
ముంచెను మల్ల యాఖిఘుడు
　　　　మోటు సుతారి ధనంబు మ్రింగె వా
దంచిత రీతి నిన్ గొలిచి
　　　　యప్పుల దీర్చితి వాని మోసపుం
బంచకుపోక నిర్చితి న
　　　　భాగ్యపు రేఖగ నెంచి మత్ప్రభూ !

అని తలంచుచుండ—

ఇట్లు స్వామి కృపచే నప్పుతీరి ఇల్లుపూర్తియై భార్యకుద్యోగము లభించెను గాని బాధలు తప్పవయ్యెను.

లౌకిక బాధలచే పరితపించు నేను తెన్నుగానక ఇలవేల్పగు శ్రీయాదగిరి లక్ష్మీనృసింహస్వామిని పరుండబోవు ముందు ప్రతిరాత్రియు—

మ॥ అది రాజేశ్వరరావుగాంచి దయతో
నాశ్వాసితుంజేసి నె
మ్మది వాగ్దానమొనర్చె మద్భవన ని
ర్మాణంబు గావింపగా
పిపపన్నిలెన్ను వెంకటయ్య యను తా
పీవాని నిర్మింప న
య్యది సంపూర్ణము నయ్యె శార్వరిని దే
వా! శ్రీ నృసింహ ప్రభూ!

ఉ॥ విశ్వసనీయు, డాప్తులెన
వేలువుటావు పరోపకారి రా
జేశ్వరరావు త్యాగధని
యెంతొ శ్రమించి మదర్థగేహముణ
విశ్వము గూర్చి కట్టడము
వేనొనరింపగఁ జేసెః బ్రోవుమా
శాశ్వత భోగభాగ్యము లొ
సంగుచు నాతని శ్రీశ! మత్ప్రభూ!

ఛందోబద్ధముగా ప్రార్థించుచు వచ్చితిని. ఆహృద్గీత మీ పుస్తకరూపము.

నా ప్రార్థన మంగీకృతమై స్వామి సాక్షాత్కార మందగలిగిన జన్మ సార్థకమగును.

ఏనాఁడే బాధకలిఁగిన యానాఁడా భావముతో పద్యమునడచినది. పాఠకులు పరమ హృదయులను, సహృదయులును నగుచో నా యీ హృద్గీతము నగు బాటుపాలుగాక స్వామి కృపచే సన్నుతిగాంచును.

# కృతజ్ఞతలు

ప్రప్రథమంగా ఓరుగల్లు విశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాలలో కావ్యగానము ఏర్పాటు చేయించిన శ్రీ విద్వాణ ముదిగొండ వీరేశలింగం ప్రిన్సిపాలువారి కళా శాల ఆచార్యులు విద్యార్థులకును, అట్లే కావ్యగానం చేయించిన మిత్రమండలి

హన్మకొండ, (ఫ్రెండ్సు క్లబ్బు) మంథెన్నవారికి నా వందనములు. (కావ్యగాన సభలం దలి అభిప్రాయములు లిందు సంగ్రహించబడినవి)

కోరినంతనే తమ అమూల్యాభిప్రాయము లొసంగిన రాజకవి చూడామణి, అభినవ నన్నయ, బర్హిర్ముఖ భాషాకోవిద అపర చేమకూర బిరుదాంకితులగు శ్రీ ఉదయరాజు శేషగిరిరావు, M. A; శ్రమకోర్చి పీఠిక వ్రాసి ఇచ్చిన శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యాం, M. A. ఉపన్యాసకులు; శ్రీ ప్రమోద్ గణేశ్ లాలే M. A. ఉపన్యాసకులు; శ్రీ భాష్యం విజయసారథి, B. O. L. ఉపన్యాసకులు; ఉభయ భాషాప్రవీణ శ్రీ విశ్వనాథ వేంకటేశ్వర్లు; శ్రీ గార్లపాటి రాఘవరెడ్డి, శ్రీ దూపాటి వేంకటరమణాచార్యులు శతావధానులు, శ్రీ గొట్టిముక్కల రాధాకృష్ణరావులకు నా కృతజ్ఞతా పూర్వక అభివాదములు.

ఇంటికి ముందు పాటకు (ముఖద్వారము) చేయించి యిచ్చిన శ్రీ ఇమ్మడి వీరమల్లయ్యగారి వేంకటేశ్వర్లు, B. A. B. Ed. గారికి హృదయ పూర్వక కృతజ్ఞతలు. స్వామి వారికి అష్టైశ్వర్యములిచ్చి రక్షించుగాక.

గ్రంథముద్రణ కెచటినుండియు దోహదము లభించనందున లలితా నామక నా దుహిత సొమ్ము విక్రయించి గ్రంథ విక్రయమువల్ల లభించు డబ్బు చేతికిగి ముట్ట చెప్పునట్లుగా ఒడంబడి ఆసొత్తుచే అచ్చు గావించితిని. ఉవారు లీ విషయము నవగాహన మొనర్చుకొన ప్రార్థన. స్వామి చిరంజీవికి ఆయురారోగ్యములిచ్చుగాక!

గ్రంథముద్రణ భారమువహించి సకాలమున కందజేసిన శ్రీ వల్లా రామకోటార్యకు నా వందనములు.

శ్రీ లక్ష్మీ నృసింహస్వామి కీ చిన్న కావ్య కుసుమము భక్తితో సర్పించు కొని, భక్తువి గావ ప్రార్థించుదును. "సర్వేజనాః సుఖినోభవంతు."

కంచరకుంటవీధి<br>H. No. 7/21<br>హన్మకొండ<br>1-1-1961

ఇట్లు,<br>చొల్లేటి నృసింహశర్మ<br>గ్రంథకర్త

# పీఠిక.

★

నిరాకారుఁడై సర్వాంతర్యామియై జ్ఞానరూపుఁడై విలసిల్లు పరమాత్ముఁడు సాకారుఁడై భక్తుల మనోరాజ్యములఁ బ్రభువై సమాహిత యోగజ్ఞాన సంపద సంతరించుచున్నాఁడు. ఎవరికి నేయే రూపుల నెట్టెట్టుల గోచరింప వలచునో హృదయం బాతఁడు నా యా రూపుల నట్టట్టుల గోచరించి భక్తులఁ బ్రోచును. ఆతని చిద్విలాస రూపము లనంతములు. తెలంగాణమున యాదగిరిపై వేంచేసిన లక్ష్మీనృసింహుఁడట్టి చిత్స్వరూపుని అవతారము. ఆమంగళస్వరూపుని మహిమాతిశయముచే నియ్యచలము భక్తజన యాత్రాస్థలమైనది.

ఉ॥ "శ్రీయుతమై, ముముక్షుతతి
సేవితమై, మునిలోకమోద సం
ధాయకమై, యఘార్తజన
దారుణదుఃఖ రుజాపహారియై,
పాయని భక్తిఁ గొల్చు బుధ
వర్గము పాలిటి కల్పవృక్షమై,
ఆయతకీర్తి యాదగిరి
యందెను నీయునికిన్ జగత్ప్రభూ!"

అని శ్రీ చొల్లేటి నృసింహశర్మగారన్నది భక్తజనాళిపట్ల పరమ సత్యము. ఆ దేవుఁడు తన్నుసమ్మిన కవీంద్రుల నెందఱినో కృపా విశేషావహ దృష్టులం గనుచు బ్రోచినవాఁడు. శ్రీ తిరువాయిపాటి వేంకటకవి ఈ సురశ్రేష్ఠమును "యాదగిరీంద్ర మ్రొక్కెదన్" అను మకుటముతో చంపకోత్పలములతో శతకహారమును గూర్చి సేవించినాఁడు. "యాదగిరి నృసింహా" అను మకుటముతో నాతఁడే కంద శతకము నొకదానిని రచించి సమర్పించినాఁడు. తెలంగాణముననే ఓరుగంటికి పంద్రెండామడ దూరముననున్న ధర్మపురియందు వెలసిన నృసింహుని గూర్చి చిన శేషప్పయనుకవి నరసింహ, నృకేసరి శతకములను రచించియుండెను. ఇందు నృకేసరి శతక ముత్పల చంపకమాలా వృత్తములందును, నరసింహ శతకము సీస పద్యములందును రచింపఁబడినది. వీనిలో—

"భూషణ వికాస శ్రీధర్మపుర నివాస
దుష్టసంహార నరసింహ దురితదూర"

అను మకుటము గైకొని రచింపఁబడిన నరసింహ శతకమునకు మంచి ప్రచారము కలుఁగుటయేగాక పారాయణ గ్రంథ గౌరవము లభించెను. స్థలాంతరము నందైనను నృసింహమూర్తి తన మాహాత్మ్యమను వెన్నెల విరజిమ్ముచు కవి కల్హార హృదయములకు సుగంధ కవితా ప్రసారావకాశముఁ గల్గించినాఁడు. గోగులపాటి కూర్మనాథుని సింహాద్రి నారసింహ శతకమును, చిత్తబోధ మానస బోధ శతక కర్తయైన తాడేపల్లి పానకాలరాయ నృసింహస్వామి శతకము నిట్టివే. ఇవిగాక నిట్టివింకను నెన్నిగలవో తెలియుదు.

ప్రహ్లాదవరదుని భక్తకోటిలో నొక సుకవి శ్రీ నృసింహశర్మగారు. ఈ కవివతంసుఁడు స్వీయ సంసార సాగర తరణమునకు కర్ణధారిగా నీ దేవుని నెన్నుకొని ప్రభువుగా సేవించినాఁడు. "ప్రభూ" అని వీరి శతకమునకు మకుటము. తెలుఁగు సాహిత్యమున దేవుని నుద్దేశించి రచింపఁబడిన శతక సముదాయములలో నాతఁడు ప్రభువని కీర్తింపఁబడి యున్నను, చూచువారి కాతఁడు కిరీటములేని రాజువలె గోచరించియున్నాఁడు. కాని శర్మగారు భగవంతునికి హేమ మకుటమును ప్రసాదించి లక్ష్మీయుతుఁడగు ప్రభువుగా నొనర్చినారు. కావున నృసింహదేవుని తలమానికమువంటి దీ మకుట కావ్యము.

ఈ శతకమునకు కృతికర్త యాదగిరి లక్ష్మీనరసింహస్వామి. యాదగిరి వాసియగు నాతఁడు గిరిస్వామి; కృతికర్త గారి వంశము స్వతస్సిద్ధముగా నొక పవిత్ర తరంగిణి అట్లగుట "ప్రభూ" సంబోధనము మధురభక్తి కాలవాలమగుచున్నది. అంతేగాక —

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్"

అను నవవిధ భక్తిమార్గముల నన్నిటను సరివచ్చు సంబుద్ధి ఈ మకుటము. ఇట్టి మకుటముతో శతకరచనకు పూనుచు శర్మగారు తద్రచనోద్దేశమును నిట్లు ప్రకటించినారు.

శా॥ స్వామీ ! నీ వొనగూర్చు మేలుల ప్రశం
సంగూర్చి పద్యాళి న
త్యామోదంబున నల్లబూనితిని భా
షార్థంబు సాధించి [illegible]
రో మాహాత్మ్యము తద్రసంబు చెవి విం
దుంగూర్చునట్లొప్ప[illegible]
సామాన్యుల్ స్తుతిగీతిగాఁ దలఁప వి
స్తార ప్రభా మత్ప్రభూ !



ఇందులో 'తద్రసంబు చెవి విందుంగూర్చునట్లొప్పగా సామాన్యుల్ స్తుతి గీతిగాఁ జదువ' నీ శతకము వ్రాయబూనుటలో "భారతామృతము కర్ణపుటంబుల నారఁగోలి యాంధ్రావలి మోదముంబొరయు" నట్లు, రచించిన **తిక్కన కవితా ధ్యేయము ధ్వనించుచున్నది.**

స్వామి యొనగూర్చుమేలుల ప్రశంసంగూర్చి పద్యాళి నత్యామోదంబున నల్లబూని. **ఈ కవి తన** భావనను కార్యరూపమొనర్చు నప్పుడు పడిన ఆవేదన గాంచుఁడు.

చ॥ "మనసునఁబుట్టు నెన్నొ యను
మానము లెన్నొ తలంపు లెన్నొ క
ల్పనలు క్షణక్షణంబున వి
పక్వత నందకమున్నె క్రుంగు వా
ర్ధిని జనియించు బుద్బుద వి
ధిన్నటుగాన మదీప్సితార్థ సి
ద్ధిని బడయున్వరంబిడుము
దీనుఁడ యాదగిరీంద్ర మత్ప్రభూ !"

ఇది కృతి నిర్మాణమునకు పూర్వము ప్రతి కావ్యకర్తయు పడు నవస్థ. దానిని సున్నితముగా వీరు ప్రదర్శించియున్నారు.

"A poem is a spiritual irritation. It annoys me till it breaks out. I some times incubate a mood

for years. I do not incubate the lines. The idea lies fallow and comes back when conditions are favourable."

— What is Creative thinking? — Catharine Patrick.

అన్న ఒక ఆంగ్లకవి స్వీయానుభవముతో పోల్చిచూచినచో నీ కవియు తన భవ్యకవితావేశమును కావ్యరూపముగాఁ దీర్చి దిద్దగల పవిత్ర క్షణముకొఱకు దేవుని పటుములంటుచున్నట్లు కాననగుచున్నది. కవి యందు కృతార్థుఁడైనాఁడు.

రసాప్లుత కావ్య నిర్మాణమునకు స్నిగ్ధమైన హృదయమవసరమగును కవికి. ప్రకృతిలోని రమణీయ దృశ్యములఁ బర్యాలోకించి ద్రష్టయై తాదాత్మ్యమును గాంచి రసలోకమున స్రష్టగా భాసించును. ఇట్టి యధికారమును సంపాదించుట
వసర

ఆమాటే మైన నిశిత ప్రకృతి పరిశీలన మీ కవియందు గ్గుతో నుద్బుద్ధమైనది.

జూచి స్నుకముగా లతామతల్లి యొడిలో నవ్వుల రతనాలొలకఁబోయు పూలబాలలఁ

తండ్రికి చె వెన్నవై పోయినాడీయన. ఈ విషయము కుసుమాస్త్రుని కన్న

లో నూది చెప్పినాఁడు.

ఉ॥

న్నని లేత తీవియకు
సున్ని జన్మమునందు, మధాళిసంహతుల్
తమైన తత్తనువు
భ్యున్నతి శోభః యశంబుః నుతింప దేవతా
వంది వారి తల
షన్నెము : భూషణమై యలరాదు పూలదే
న్నెమంచు తల
పోయదు నాత్మ నృసింహ మత్ప్రభూ!

మధుర ప్రణయము నాలపించు భావకవితాఛాయ లిందు గోచరించుచున్నవి.

మన సాహిత్యమున శతకములు భక్తి, శృంగార, నీతి, మత విషయకము లైన ప్రధాన భేదములచే నొప్పుచున్నవి. అందున భక్తిరస ప్రధానములు సంఖ్యకు హెచ్చు.

" చేతులారంగ శివుని పూజింపదేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని
కలఁగనేటికి తల్లుల కడుపుచేటు "

అను భాగవతోక్తిని దృష్టియందుంచుకొన్నచో అనంత సంసార సాగర తరణైకసాధనుండగు నారాయణుండొక్కఁడే శరణ్యుండని నమ్మి జీవుఁడు నిర్వాణ పథమున నడచుచుండును; ఐహిక, పారమార్థికములందు శాశ్వతానందసంధాయిము నకై పరబ్రహ్మ నుపాసించును. అట్టి భక్తి యోగసాధనాత్మకమగు మానవ ప్రవృత్తియే రాగరంజితమయి కవితగా స్రవించినచో భక్తి శతకమై యలరారు చుండును. శర్మగారి శతక మా శాఖలోనిది. మానవుఁడిహమున పురుషార్థ సాధనమున మన స్థైర్యమును, దైవ సహాయమును అభ్యర్థించును. సర్వ సమర్థుఁడైన భగవంతుని సహాయములేనిది అలింద్రియసాధనలు మానవ మాత్రుల కసాధ్యములగునుగదా ! అందువల్లనే కవి

మ॥ హృదయావేదన వహ్నినార్చి, బహు సా
హిత్య క్రియాదూప సం
పదలన్గూరిచి, ధర్మః మర్థమునుః కా
మంబుం బ్రసాదించిః యా
పిదపన్మోక్ష మొసంగ వేడెదను సం
ప్రీతిన్ జగన్నాయకా !
సదయాత్మా ! మునిముఖ్యవందిత పదా
బ్జా ! శ్రీనృసింహ ప్రభూ !

అని పురుషార్థ సిద్ధికొఱకు దేవుని నభ్యర్థించుచున్నాడు

శ్రీ చొల్లేటి నృసింహశర్మగారి శతకమున నిచ్చటనొక్క విశేషమున్నది. సామాన్యముగా భక్తిరస ప్రధాన శతకములందు కవి

సంసార విరక్తుఁడై త్రిపురుషార్థ సిద్ధిని గోరక మోక్షము నొక్కదానినే అభ్యర్థించుట కాంచెదము. ఉదాహరణమునకు —

శా॥ అలుంబిడ్డలు తల్లిదండ్రులు ధనం
బంచున్మహాబంధనం
బేలా నా మెడఁ గట్టినాఁడ విఁక ని
న్నేవేళఁ జింతింతు ని
ర్మూలంబైన మనంబులోనఁ గడు దు
ర్మోహాబ్ధిలోఁ గ్రుంకి యీ
సీలామాలపుఁ జింత నెట్లుడిపెదో
శ్రీ కాళహస్తీశ్వరా!"

అని ధూర్జటి —

ఉ॥ "ఎక్కడి తల్లిదండ్రి, సుతు
లెక్కడివారు, కళత్రబాంధవం
బెక్కడ జీవుఁడెట్టి తను
వెత్తినఁ బుట్టుచుఁ బోవుచున్న వాఁ
డొక్కఁడె; పాపపుణ్యఫల
మొందిన నొక్కఁడె; కానరాఁడు వే
ఱొక్కఁడు, వెంటనంటి; భవ
మొల్లనయా, కృపజూడవయ్య నీ
తక్కరి మాయలందిడక
దాశరథీ! కరుణాపయోనిధీ!

అని రామదాసు —

కాని ఇట్టి విరక్తి భావము సామాన్యునికి కనుగుట కష్టము: దానికి కొంత సంస్కారమవసరము. శర్మగారి లక్ష్యమున ఈ శతకము 'సామాన్యులకు చెవి విందొనరించుటయు, వారికిది ష్టుటగీతిగా నిలచుటయు' నై యున్నది. సామాన్యుల నుపలక్షించి వ్రాయఁబడు శతకమునందు ప్రత్యేకాధికారులగు సుసంస్కృతుల చిత్తవృత్తి కనువగు విరక్తి మార్గమొక్కదానినే అనుసరించినచో వ్యాఘ్యది

వారికందని మార్గనిపండయి తీరునుగదా! అందువలననే మానవ జీవితమునందు పురుషార్థ సాధనమెట్లు జరుగవలయునో నిర్దేశించి ఒకమెట్టు తర్వాత మరియొక దానిని సూచించియున్నారు. కాళిదాసు రఘువంశ రాజులపట్ల

" శైశవే౽భ్యస్త విద్యానాం యౌవనే విషయైషిణాం
వార్ధకే మునివృత్తీనాం యోగేనాన్తే తనుత్యజామ్ "

అని చెప్పిన సూక్తి సర్వమానవాదర్శమైనది. అట్లగుచో బాల్య, యౌవనములందు ధర్మార్థకామము లుపాదేయములగుచున్నవి. అట్టియెడ —

శా॥ "సౌభాగ్యం బొనగూర్చి, రాజితబృహ
త్సౌఖ్యంబుగ నందెల్చి, వి
ద్యాభూతి ప్రతిభాప్రవీణతల సం
ధానంబుగావించి స్వా
స్థ్యాభివ్యాప్తి నొసర్చి, భోగముల ని
త్యంబో లలాడింపుమా
క్ష్మాభామాహృదయేశ! యాదగిరి వా
సా! శ్రీ నృసింహ ప్రభూ" !

అను ప్రార్థన యువకుల కెంతయు సమంజసముగా నున్నది. ఆశ్రమములలోకెల్ల గృహస్థాశ్రమము శ్రేష్ఠమని ధర్మజ్ఞులందురు. అందు 'ధర్మార్థ కామ సాధనకుపకరణంబు, గృహనీతి విద్యకు గృహము విమలచారిత్రశిక్షకాచార్యకంబన్వయ స్థితికి మూలంబు, సద్గతికి నూఁత' యగు భార్య పురుషుని కాధారము దీనినే —

అంగనలేని యిల్లు కుసు - మాయుధు క్రీడలులేవి ప్రాయమున్
సంగర రంగమందుఁ గడు - సత్వముజాలని యట్టి శౌర్యమున్
రంగు లెఱుంగనట్టి సతి, - రాజ్యవిహీనత నొందు రాజు నీ
మంగళమూర్తిఁ గన్గొనని - మానవుఁడున్ వృథఁ జెందు నింతె యా
యంగజుగన్నతండ్రి విను - మా యిది శ్రీరమణీమనోహరా !

— గంగాధరుఁడు: శ్రీరమణీమనోహర శతకం.

అని గంగాధరుఁడు చమత్కారముగా స్థిరీకరించినాఁడు. తన శ్రీరమణీ మనోహరశతకమున అట్టి భార్యను, కులదీపకులగు పుత్రులను, రక్షింపుమని సవినయముగా వేఁడుకొనినాఁడీకవి.

ఉ॥ "శాంతముగూర్చి నా మనసు
చక్కన దిద్దుము నేనుగొప్ప వే
దాంతినిగాను లౌకికుఁడ
దారసుతాదుల యందు ప్రేమ మ
త్యంతము దూరవాసము ప్ర
యాసముగాన దయాతరంగిత
స్వాంతము బూని సాకుమని
సాగిలి మ్రొక్కెద నిచ్చలుఁ బ్రభూ !"

ఇది గృహస్థుల హృదయాకర్షముగా నున్నది.

'గడచెను ఏబదేఁడులు' గతంబునుగూర్చిన చింతతో 'విషయాసక్తుఁడనై చరించితిని నిర్వీర్యుండనైతిని' భవద్విషయాసక్తి లభించె దోషముల నన్వేషింప కాత్మీయుఁగా విషమాభ్యాసువి దిద్ది బ్రోవు మనుచు "విషయాతీతుని" బ్రార్థించినాడు. ఇట్లు క్రమముగా భక్తుఁడై, విరాగియై, యోగియై, యతియై చతుర్థ పురుషార్థ సాధనాయత్తుఁడగును మానవుఁడు. పండిత జగన్నాథులన్నట్లు—

"యథా తానం వినా రాగో - తథా మానం వినా నృపః
యథా దానం వినా హస్తీ - తథా జ్ఞానం వినా యతిః"

కావున యతికి జ్ఞానసముపార్జన మావశ్యకమగును. సచ్చిదానంద బ్రహ్మమును గూర్చిన విచార మా యతియందు ప్రారంభమగును. వార్ధకమున మునివృత్తి నవలంబించు వారికిది హృద్గీతగా నలర గలదు. ఈ చింతనమునకు జ్ఞానము తోడైనచో సాంఖ్యయోగాంతసిద్ధుఁడు కాగలఁడు నరుఁడు.

"ఆనందంబున ప్రాణికోటి జననం
బందుంబ్రివర్తిల్లు, గా

నానందంబున గిట్టి లీనమగు నా
యానందమంచెప్పు ద
య్యానందంబును బ్రహ్మమే యనుచు వే
దాంతంబు ఘోషించు బ్రి
హ్మానందంబు నెఱుంగు టెట్టులోగదా!
యాదాద్రివాసా! ప్రభూ!!"

అతని హృదయ సముద్రమున జ్ఞానామృత రసమునకై జరిగిన మధనమునకు—

"ఎక్కడ, నేను, యెప్పుడు సుందుల కెట్టుల నెవ్వరన్న"
"ఎక్కడనుండి రాక" మొదలైన పద్యము లుదాహరణములు.

ఇది కవి యొక్కని బాధకాదు. జీవిత లక్ష్యసాధకుడగు ప్రతి జీవుని ? ఫ బాల్యమునుండి వార్ధకము వఱకు నాతడాశ్రయించు నాశ్రమములం దెప్పటికప్పుడు అనువైన అర్థసాధన కుపకరించుట కేర్పడిన భక్తునిహృ ద్గీత ఈ శతకము.

పురాణగాథలను కొన్ని, కృతికర్త జీవిత చరిత్రలను కొన్ని, దైవలీలను కొన్ని, తాత్త్విక చింతలను కొన్ని, నీతి బోధలను కొన్ని, యతి వృత్తములుగా నడచిన శతకములు సాహిత్యమునందు కొన్ని యున్నను సమగ్రజీవితవ్యాపియై నలరారు మానవుని మనస్థితిని సంపూర్ణముగా, క్రమబద్ధముగా తీర్చిదిద్దిన శత కములు చాల తక్కువ. అట్టివానిలో యాదగిరి నృసింహశతక మొకటి. అందువలననే దీనికి హృద్గీత యను నామాంతరము సార్థకమగుచున్నది.

దశావతార వర్ణనమిందు సరసముగ నొనర్పబడి యున్నది. ఈ శతకకర్త సహజముగ కడు సాధువు ఎంత వేడినను దైవము సాక్షాత్కరింపకపోయినచో

"..........................
నిశ్చల భక్తితోడ, నీ

చరణములంటి యర్చనను
సల్పగ, వందనమాచరించ, దా
స్యరీతిని దేల, సఖ్యమున
నాత్మ నివేదనముం బొనర్ప నీ
దరి నెనమిచ్చి యేలుము ని
తాంతము యాదగిరీంద్ర మత్ప్రభూ"

"ఏ రూపంబున నిన్నుఁ గొల్తు మదిలో
నేరూపముం దాల్తు, ని
న్నే రూపంబున గాంతు నీయణువు రూ
పేదో మహారూపమే
దో రాజీవదళాయతాక్ష కడు ము
గ్ధుండన్ భవత్పాద ప
ద్మోరుస్వాదురసామృతంబు నిడు న
న్నోమన్ నృసింహ ప్రభూ!"

అని కాళ్ళ వేళ్ళ బడునుగాని కలలోనైనను ధూర్జటివలె కనులెఱ్ఱఁజేసి-

"నిన్నే రూపముగా భజింతు మదిలో
నీరూపు మోఁకాలొ శ్రీ
చన్నో కుంచమొ మేఁకపెంటికయొ యీ
సందేహముల్మాన్పి నా
కన్నారన్ భవదీయమూర్తి సగుణా
కారంబుగాఁ జూపవే
చిన్నీరేజ విహారమత్తమధుపా
శ్రీ కాళహస్తీశ్వరా!"

అని గడుసరియై నమ్మినవానిని వెక్కిరింపఁడు. ఈతని వినయ పరత మూర్తియే, ఇతని ప్రసన్నతయే యెల్లెడల కవిత్వమునందు జాలువారినది. మతసహనము వీరి గుణౌన్నత్యముఁ జాటుచున్నది.

"లోకము మెచ్చునట్లుగ మచ్చరితంబు దిద్దు"మని కోరుటచే సుశీలుఁడని బోధపడుచున్నది. వీటన్నిటితోపాటు ప్రభువశీకరణ రహస్యవేదిగా గనపట్టుచు చిత్రమైన తర్కము నుపయోగించి నృసింహునితోపాటు పతితను అకట్టుచున్నాడు.

మ॥ "అనిమిత్తంబుగ మద్గృహంబునకు రా
డాసక్తితో నెవ్వడుఁ
అనిమిత్తంబుగ భక్తుఁడెవ్వఁడును నీ
యాదాద్రికిఁ రాడు పా
వననామా! జనులెల్ల స్వార్థపరులై
వర్తిల్లుచున్నారలం
దున నేనొక్కఁడ ప్రోవుమా కరుణ నఁ
దోషఘ్న శ్రీ మత్ప్రభూ!"

శర్మగారీ శతకమునందు ఉపమ, రూపక, కావ్యలింగ, పరికరాది అలంకారములను వాడి యుండిరి. కొన్నియెడల స్వభావోక్తి సహజముగ్ధసౌందర్య ప్రదర్శనమున లోకము నాకర్షించు జానపద సుందరివలె గోచరించుచుండును. అలంకారములామె కాభరణములవలె నిందు శోభించుచున్నవి. మచ్చునకు—ఉపమకొక్క ఉదాహరము.

ఉ॥ "లౌకికమైన బంధనము
లం దెగఁద్రెంపగఁబూనఁ ద్రెళ్ళ పీ
పోకదలోన ముళ్ళు పడు
పోగులు; విప్పగరాని రీతిగా
కాకవి పద్యపంక్తివలె
కావున బంధవిముక్తిఁజేసి స్వ
ర్లోక సుఖంబుగూర్పు మది
లో నిను నెంతు నృసింహ మత్ప్రభూ!"

రూపకమునకు :—

మ॥ "దురహంకారకనామ విస్తృత మహో
త్తుంగోర్మి భంగార్భటీ

భరితాంభోనిధి నాదు మానస మదే
భంబుగ్రకుంభీర ఖీ
కర దంష్ట్రాహతి జిక్కి సుక్కి కడు నా
క్రందించుచుందెా భవ
చ్చరణంబే శరణంబుగాఁ దలఁతు మో
క్షంబిమ్ము శ్రీ మత్స్యభూ!"

సరళ సంస్కృత సమాసము శీతని సొత్తులు. భావముల వ్యక్తీకరింప సమర్థములగు పదజాలము వాడుటయు, వ్యర్థపదములు సాధ్యమైనంతవఱకు వాడకుండుటయు, వర్ణనములు యుక్తియుక్తముగ నొనర్చుటయు, సమన్వయ సౌలభ్యమును వీరి కవితాలక్షణములు. కఠిన ప్రాసముకైనను గైకొని పద్యములను ధారాళముగా వ్రాయుధార గలదు వీరికి. ఎడనెడ తెలుఁగు పలుకుబడి సజీవముగా కదలుచు రస స్ఫురణమొనర్చుచున్నది. "కుడిచెడువాని దుర్విధిని గుమ్మడి చేదగు" ననెడి సామెతలు "చాఁగలిగొట్టు, చావకచచ్చి, మిత్తింటి తలంపు," మొదలగు తెలుఁగు పదప్రయోగమును ప్రశంసింపదగినది. ఇంతియగాక 'రబ్బరుముక్క,' 'భరోస,' 'నమోదు' మొదలగు అన్యదేశ్యములను సైతము నిరాక్షేపముగా వాడిరినారు. అచ్చటచ్చట అనుప్రాస, యమకాది శబ్దాలంకార ప్రయోగంబును సాధించినారు. కదళీపాకము. పోతన, ఎఱ్ఱాప్రెగ్గడ, ప్రబంధ కవుల అనుకరణలవలె నెడ నెడగానఁ బడుచున్నను వానిపై స్వీయకవితాముద్రవేసి స్వంతముజేసి కొనినారు. శార్దూల, మత్తేభ, చంపకోత్పలములలో శతకము రచింపఁబడినది. మంగళ మహాశ్రీ వృత్తముతో ముగియుచున్నది. మొదటి 3 పద్యములు శ్రీకారారంభములో వెలయుచున్నవి. వీనితోపాటు శతకమున సమకాలీన సంఘ విమర్శను, ప్రపంచ సంఘటనలను, ఇందు ప్రవేశపెట్టినాడు. చూడుము. 102, 45, 46 పద్యములు.

ఈ శతకమున ఉపక్రమణోపసంహారణము లందొక చక్కని వైశిష్ట్యము గానవచ్చుచున్నది. శతకము మంగళ ప్రదమైన శ్రీకారముతో ప్రారంభమైనది. లక్ష్మీ నృసింహాని స్తుతియుండెడి విషయము— ఇందులో నొక్క విశేషము. "ముక్తిప్రదమైన నీ పదము నిత్యంబెంతు శ్రీ మత్స్యభూ!" అని అనుట దేవతల

వర్ణించునప్పుడు ఆపాదమస్తక న్యాయము పాటింపవలయునను లాక్షణికనియమము పాటింపబడినది. అంతియగాక పూజనీయమైన, గౌరవనీయమైన, శరీరాంగము పాద ద్వయమని భారతీయ సంప్రదాయము. దీని ననుసరించియే పూజ్యపాద, గురుపాద, శ్రీపాద, అఖిలభువన రాజమకుట రత్నరంజితపాద మొదలగు సమాసముల వాడు ఆచారము వ్యాపించియుండి యుండును. వీనిని గమనించి శ్రీ శర్మగారు శ్రీ లక్ష్మీ నృసింహ పాదద్వయమును కీర్తించినారు.

శ్రీమత్త్వమును, ప్రాభవమును, పుట్టువు కృతార్థత నొందుటయు. కవిత్వమును, మోక్ష ప్రాప్తియు, లభించుటకు విశేషణములందు బీజారోపణము చేయబడినవి. కావ్య ప్రయోజనము లన్నియు ఇందు సూచింపఁబడినట్లైనవి. భరతోర్వీ ప్రాభవముతో శతకము ప్రారంభమై ఓరుగల్లు ప్రాభవముతో చిత్రముగా ముగించియున్నారు. స్థూలమునుండి సూక్ష్మమునకు జరుపు గమనమువలె నున్నదీ పోకడ. తత్త్వవిదులు, భక్తాగ్రగణ్యులునైన శ్రీ శర్మగారికి శ్రీ నృసింహుండాయురారోగ్య సంపత్తుల నొసగుగాత!

ఉ॥ "నీకృప గల్గియుంట నళి
నీదళలోచన! భావిజీవితం
బాకృతి నొందుదాల్చి హృద
యార్తినిబాపె; తలంప మిన్నలౌ
నీకృతులెన్న శక్యమె! పు
నీతునిగా నొనరించి యింక నా
ప్రాక్కృత కర్మబంధముల
బాపుము యాదగిరీంద్ర మత్ప్రభూ!"

ఓం తత్సత్

---

[ ఈ విమర్శ మిత్రమండలి (హన్మకొండ) సమావేశములో వినిపింపబడినది. ]

ఆర్ట్సు & సైన్సు కళాశాల
ఓరుగల్లు.
9–1–1960

(సం.) శ్రీ సుబ్రహ్మణ్యముగారు
ఉపన్యాసకులు

# ఆలోకము

★

Shri **Cholleti Narsimha Sarma** deserves special compliments for writing a century of verses (Satakam) dedicated to the Lord Lakshminarasimha of Yadagiri. In Telugu, I learn, Satakas are written since long and that all of them closely follow the Pattern of Sanskrit Sataka literature. In Sanskrit literature the religious and didictic Poetry is dominated by Satakas and Stotras. This literature flourished only after 6th century, a period which saw the rise of many religious sects.

But Shri **Sharma's** Satakam is not only modern in time but modern in out look. Devotion is the under-current of all Satakas and Narasimha Satakam is also full of devotional fervour. But there is a clear digression from the Traditional pattern. The traditional Sataka literature, both in Sanskrit and in Telugu, is rich in alliteration and Yamakas and as Keith has, **pointed** out, the Sataka writers are fond of Paranomasias of claborate kind and of using words where sound matches the sense regading. This aspect, I suppose Shri Sarma has laid down his own pattern.

He has employed some Sanskrit metres along with Telugu metres. 14 Verses are in Sardoola vikriditam 28 in Champakamala, 41 in Utpala-

mala and 24 in Mattebha. This diversity in metres not only indicates his mastery over the Versification, but also points out to the special predilection he has for Telugu metres.

Shri Sarma displays remarkable scholarship, especially that of Sanskrit tradition. Sanskrit Sataka literature is full of long-wending compounds and the Poets, who are devotees at the same time, surrender themselves to their deities. This self dedication arising out of self introspection and consequent feeling of remorse, has a personal appeal to the readers The personal note has a special enchantment to the devotees There characteristics are profoundly exempted in Narasimha Satakam.

'భవత్పాదాబ్జామృతపాన మత్తుఁడ, 'నిత్యాంతమైన మదీయ జీవన తరుచ్ఛాయాశ్రిత శ్రేణికిన్, 'అపూర్త్తజన దారిద్ర్యదుఃఖగజాపహారమై, such lines are reminiscent of Sanskrit verses. But the anthor has given a local colour to verses by using Telugu expressions like "కుండలో పుట్టినవాఁడు సంద్రముల పుక్కిటపట్టెను 'ఏయుందు భరోస

This feature is quite out-standing, The poet also alludes to certain scriptural expressions like "ఓం పూర్ణమిదం పూర్ణమదః .., కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః.

Such usages lend a spiritual colour to the entire gamut and the theme of Bhakti gets elevated and exalted.

The poet has indirectly described his personal life and the various ordeals through which he had to pass. His reworse was well expressed in such lives as— "బుద్ధి జాడ్య జనిత వ్యగ్రత్వయుక్తుండు, "కుడిచెడు వాని దుర్విధిని గుమ్మడి చేదగు.

These confessions are necessary prerequisity for self perification and with out the clear surface of the mental mirror. The reflection of inner-most Develler is difficult to have

This note of self criticism is heightened on the social back ground, which is superbly described in some verses. The assasination of the prime minister of Ceylon, the present day tenderncy to grab every thing for personal benifit are fittingly brought in to have some bearing on the theme. The poet is utterly disgusted at the selfish and frandulent world; he finds the world full of corruption and his delicate mind scorched by the brutal tendencies tries to seek shelter at the feet of Lakshmi Narasimha Swamy of Yadagiri. The can disembarrass his soul only before the Lord who is the only saviour of the world. This deteiionated condition of the world is also one of the causes, in addition to the personal miseries, which impel the poet to take recourse to the very epitome of virtue and succour.

In praising Narasimha and requesting him to save himself and the world from the imminent

cataclyms, the poet has shown wonderful sense of propriety. Who else, save Narasimha can save humanity from the ravages of demous or demonic spirits? The poet has described the verions descents, and their functions and has exorted Narasimha swamy to give redemption to him.

We has often alluded to the six inner enemies- అరిషడ్వర్గము. It is these foes who have completely vanquished him and it is from the clutches of these foes that he is seeking release at the hands of the Lord.

This has ennobled the theme of the poem philosophically. Other wise the poem could have simply become a drab Stereo-typed one. The poet by introducing Philosophical as well as social element, has commended himself for appreciation even to the modern fastidious fault-finders.

Even from the purely psychological point of view, it can be safely said that the verses are replete with various operations of emotions. The various dimensions of feelings so much required for the personal communion, are conspicuous here. Especially expectance-release and desireaversion groups of ten, found expression in these verses. Here all the feelings have got a wide range for the lower form of considering one self as sinner upto the higher forms of direct connection with the Lord.

The entirs texture of poems is full of devotional tranquil charm, which also stimulates, devotion and remorse in the reader and alerts him for introspection. All the verses are written in simple Telugu, studded with the jewels of Sanskrit expressions and the phrases and expressions are admirable for their wonderful lucidity, terseness, naturalness and lack of affectation.

The delicious elegance of the style is note worthy.

Thus Shri **Sarma** has done a signal service to the Telugu literature by writing this Satakam traditional in spirit and contents, but modern in design and appeal.

**18-1-1960**
Pushya Suddha, 5.

(Sd.) **P. G. LALYE,**
Lecturer.
Arts and Science Colloge,
WARANGAL.

# పరిచయము

★

ప్రకృతిరంగే ప్రకృతిభావనా భావితాయాం భావవీధ్యాం సాత్త్వికశక్తివికాసినీం మనోముకురే స్ఫుటప్రతిభాసమానాం సాహితీదేవతాం సహృదయాః సహృదయేషు సముపాసతే -

సాహితీదేవతాయాః స్వరూపం సాత్త్వికానామేవ గోచరీభవతి.

రజస్తమోద్రేకపరీతం మానసం సత్పురుషసూక్తిజాలేన విమలీకృతం భవతి. విశ్వరంగేనానావిధ మానసికకల్లోలసమాకులితమానసానాం మానవానామమృతమయం జీవనం కరోతి సాహిత్య మిదమేకమేవ ఇత్యత్ర న అవితథోక్తిః న అత్యుక్తిః । రాజకవిః సంస్కర్తా చిత్రకారీచ లోకముజ్జీవ యియం స్వప్రాణాన్ ధారయంతి.

ఏతేషాం సాధనానాం భిన్నత్వేపి లక్ష్యం తావదేకమేవ. ఏతేషాం మధ్యే కవిః అత్యంతమ్ వందనీయః, యోహిస్వయం దుఃఖమనుభవన్నపి లోకాయ అలౌకికమానందం దదాతి. అతః కవిః ఋషిః. ఋషిత్వంవినా కవిత్వం దుర్లభం, పరమాత్మసాక్షాత్కారసంపాదనాయ ఋషిః యథా ప్రయతతే తథైవ అలౌకిక బ్రహ్మానందసాక్షాత్కారీకరణాయ కవిః ప్రయతతే "అపారేకావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః యథాస్మైరోచతేవిశ్వం తథైతం పరివర్తతే" ఇత్యాదికమ్ వాక్యం తమేవార్థం ప్రమాణయతి స్వప్రతిభా సంపత్త్యా ఉత్తమకావ్యం నిర్మాయ లోకాయ మహాంతముపకారం కరోతి. అపిచ, అసుందరమపి సుందరం, దుర్గంధిలమపి సుగంధిలం, నీరసమపి సరసం, అచేతనమపి చేతనం స్వభావనాబలేన పరివర్త్య పాఠకానాం హృదయరంగే అపూర్వంవస్తూద్భవం కరోతి. ఏతాదృశలక్ష్యసంసిద్ధైః కవిః చిరతరం యశః లభతే, అతఏవ "కావ్యంతుజాతుజాయేత కస్యచిత్ ప్రతిభావతః" ఇతి అభియుక్తిః. తన్మూలా ప్రకృత మనుసరామః

శ్రీమతః చొల్లేటి నృసింహశర్మణః నృసింహదేవతాకం శతకంతావత్ శతకోటిమేవ అధిరోహతి. కవితాసరసా హృదయంగమాచ, పాఠకానాం ప్రతిపద హృదయస్పందనం కరోతి. అపృథక్ యత్ననిర్వర్త్యాః అలంకారాః భక్తిరూ భావస్యనృసింహవిషయిక నృసింహ తస్య కావ్యాత్మభూతస్య కామపి విచ్ఛిత్తి జనయతి.

యావజ్జీవిత తపః ఫలమివ కావ్యమిదంవరీవర్తి. తత్ర తత్ర సామాజికపరిస్థితిః లోకప్రగతిశ్చ స్ఫుటం గోచరీభవతి. కోనామ సహృదయః వేదనాభరితం ఏతాదృశం కావ్యం పఠితమ్ ఆనందం నానుభవతి?

కవిః అతీవ వశ్యవాగివ దృశ్యతే. భావోచితః అర్థః, అర్థోచిత శ్శబ్దః, శబ్దోచితోవిన్యాసశ్చ సర్వత్ర దరీదృశ్యతే– పాశ్చాత్యదుర్వాసనావాసితానాం జనానాం ఏతాదృశ కవయః మార్గదర్శినః భవంతి. విమలం భారతీయం ఆధ్యాత్మికతత్త్వం, స్ఫుటం ప్రతిపద్యం ప్రతిభాసతే. అపిచ అర్థగాంభీర్యం, భావేహృదయస్పందనం, శబ్దేసౌష్ఠవం, రీతౌ ఔదార్యం, వేదనాయాం మాధుర్యం, కల్పనాయామనల్పత్వంచ స్మారంస్మారం మమహృదయం కామపి ఆనందస్య పరాకాష్ఠా మధిరూఢ మభవత్. 'రంగత్తుంగతరంగడోలికల,' 'గురువులబోధతత్త్వముల,' 'పూర్ణంబయ్యెదిపూర్ణమద్ది,' 'కదలికలేనిదై,' 'దురహంకారకనాము,' 'ఆనందంబున,' 'ముప్పిరికూట మీప్రకృతి,' 'ఎచ్చటనుండిరాకయిటు,' 'అభ్యుకపీంద్రకోకిలల,' 'ఎదయనుహామకుందమున,' ఇత్యాదిషు పద్యేషు భావాః అలంకారాః వృత్తయశ్చాహమహమికయా నరీనృత్యంతి. విశేషతః సారాలంకారః వక్రోక్తిః రూపకం. ఉపమా పరికరః కావ్యలింగం అర్థాంతరన్యాసః ఇత్యాదయ అలంకారాః మహాకవే అస్య భావనాశక్తిం అలం కుర్వంతి. అహో! కవిః వితరాం ధన్యః. సర్వాంతర్యామీ చతుర్వ్యూహాత్మకః భగవాన్ శ్రీమాన్ యాదగిరి నృసింహదేవః ఆయురారోగ్యభాగ్యాధికం దత్వా మహాకవిమముం శ్రీ చొల్లేటి నృసింహశర్మాణమ్ అవతు ఇతి ప్రార్థయే.

విశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాల,
ఓరుగల్లు.

శ్రీభాష్యం- విజయసారథి, B. O. L.

ఓం.

# శ్రీ యాదగిరి లక్ష్మీనృసింహ శతకము

శా॥ శ్రీమత్స్వర్గంబున కాస్పదంబు, భరతో
ర్వీపార్థివ స్ఫారకో
ద్దామంబౌ చదలేటి పుట్టువునకున్
స్థానం, బహూల్యాశుచి
ప్రామాణ్యంబునకుద్ది, శ్రీబలిశిరో
భాగాగ్ర సంస్థాపితం
బాముక్తిప్రదమైన నీపదము ని
త్యం బెంతు శ్రీమత్ప్రభూ!

ఉ॥ శ్రీరమణీ మనః కమల
సీమ మనోహరలీల నిల్పి, సం
సారమహాబ్ధి సంతరణ
సాధనకై పద పద్మయుగ్మ మిం
పారగఁగొల్వ భక్తజను,
లార్తులు మేఘగభీరరావమొ
ప్పారగఁ బిల్వ, యాదగిరి
యందు వసించితివీవు మత్ప్రభూ!

ఉ॥ శ్రీయుతమై, ముముక్షుతతి
సేవితమై, మునిలోకమోద సం
ధాయకమై యపూర్తజన
దారుణదుఃఖ రుజాపహారమై,
పాయనిభక్తిఁ గొల్చు బుధ
వర్గము పాలిటి కల్పవృక్షమై,
ఆయతకీర్తి యాదగిరి
యందెను నీయునికిన్ జగత్ప్రభూ! ౩

శా॥ స్వామీ! నీ వానగూర్చు మేలుల పరిశం
సంగూర్చి పద్యాళి న
త్యామోదంబున నల్లఁబూనితిని భా
షార్థంబు సాధించి ఛం
దోమాహాత్మ్యము తద్రసంబు చెవి విం
దుంగూర్చునట్లొప్పగా
సామాన్యుల్ స్తుతిగీతిగాఁ దలఁప వి
స్తార పరిథిన్ మత్ప్రభూ! ౪

మ॥ ప్రతి పద్యంబు రసోదయంబుగ రచిం
పంగల్గు వాక్ఛక్తి; హృ
ద్గత భావంబుల పరిస్ఫుటంబుగ వెలుం
గంజేయు సారోక్తి; సా

ర్థత నొప్పారు భవద్విలాస పరిపూ
　　ర్ణంబైన యర్థోక్తి; స
మ్మత రీతిన్గొనియాడు భక్తినిడుమా
　　మానాథ! శ్రీమత్ప్రభూ! ౫

ఉ॥ నీమముతోడ నీస్మరణ
　　నిశ్చలభక్తినొనర్చుచుంటి ను
ద్దామ! యశోవిశాల! భవ
　　తారకనామ! సురేంద్రవందితా!
కాముల బాపి సంసరణ
　　వారిధినుండి తరింపఁజేసి నా
కామిత సిద్ధిఁజేసి కృప
　　గావుము యాదగిరీంద్ర మత్ప్రభూ! ౬

శా॥ సౌభాగ్యం బొనగూర్చి, రాజితబృహ
　　త్సౌఖ్యాంబుధిం దేల్చి, వి
ద్యాభూతి ప్రతిభాప్రవీణతల సం
　　ధానంబుగావించి స్వా
స్థ్యాభివ్యాప్తి నొనర్చి, భోగముల ని
　　త్యంబోలలాడింపుమా!
లక్ష్మీభామా హృదయేశ! యాదగిరి వా
　　సా! శ్రీ నృసింహప్రభూ! ౭

శా॥ నీదాసుండను, నీకు భక్తజనుఁడ
నన్నిద్రాతురుండఁ భవ
త్పాదాబ్జామృతపానమత్తుఁడనునై
త్వన్నామగానంబు నిం
పాదిఁ సల్పగ పూర్ణశక్తి నిడు మ
వ్యాజానుకంపామతిఁ
యాదాద్రీశ్వర ! భక్తపోషక ! నృసిం
హా ! శ్రీశ ! శ్రీమత్ప్రభూ ! ౦

మ॥ హృదయావేదన వహ్నినార్చి, బహు సా
హిత్య క్రియారూప సం
పదలస్గూరిచి, ధర్మ; మర్థమును; కా
మంబుం బ్రసాదించి; యా
పిదపన్మోక్ష మొసంగ వేడెదను సం
ప్రీతిఁ జగన్నాయకా !
సదయాత్మా ! మునిముఖ్యవందిత పదా
బ్జా ! శ్రీనృసింహ ప్రభూ ! ౯

మ॥ కరుణాసింధుఁడు, చిత్స్వరూపుఁడు, నిరా
కారుండు, లోకంబులం
బొరియింపఁ భరియింపగా, నడుప నే
ర్పుం జూపువాఁడంచు, బం

ధర కౌతూహల యుక్తచిత్తమున దో
డ్తో నిన్ను నశ్రాంతముఁ
బరమామ్నాయములెల్ల గొల్చుగద దే
వా ! శ్రీనృసింహ ప్రభూ ! ౧౦

మ॥ అసహాయుండను, నన్యచింతనము లే
దాత్మన్విలోకింప వి
శ్వసనీయంబగు నీదు వాక్సరణి నే
బాటించితింగాన; నం
తసముం గూర్చుము క్షేమమారసి నితాం
తంబోముమా నన్ను రా
క్షస సంహారక ! దీనపోషక ! రమే
శా ! శ్రీ నృసింహ ప్రభూ ! ౧౧

చ॥ మనమెపుడొందు వేదనలు,
మానవుకోర్కులు, వానిదీర్చు సా
ధనములులేవు, నీ చరణ
దాస్యము దప్ప మఱొండుగాన స్వ
ర్ధునికి సదాశ్రయంబయిన
తోరపు నీ పదమంటి కొల్తు నే
ననఘునిగా మదాపదలు
నంతమునంద నృసింహ ! మత్ప్రభూ ! ౧౨

మ॥ పరిపూర్ణంబగు నీ కృపారసము నా
పైఁ జిల్కునా నాఁడు నే
నరయం జాలక బుద్ధి జాడ్యజనిత
వ్యగ్రత్వ యుక్తుండనై
చిరకాలంబు మనంగనేర్తునెటు లి
స్సీ! యంచు లోకంపు పెం
బరువున్మోసి కృశించుచుంటిని క్షమ
స్వ. శ్రీ నృసింహ ప్రభూ! ౧౩

ఉ॥ లౌకికమైన బంధనము
లం దెగఁద్రెంపగఁబూనఁద్రెళ్ళ వీ
పోకడలోన ముళ్ళు పడు
పోగులు; విప్పగరాని రీతిగా
కాకవి పద్యపంక్తి వలె
కావున బంధవిముక్తిఁజేసి స్వ
శ్లోక సుఖంబుగూర్పు మది
లో నిను నెంతు నృసింహ మత్ప్రభూ! ౧౪

చ॥ 'కుడిచెడువాని దుర్విధిని
గుమ్మడి చేదగు' నంచువిజ్ఞు లా
డెడు నుడి సత్యమాయగ
నెన్నిశుభంబులు గూడుచున్న వం

దడుగడుగందున న్నిడుము
　　లడ్డుగ తార్కొను, వానిమార్కొనం
దడఁబడుచుంటి నాకిడుము
　　ధైర్యము యాదగిరీంద్ర మత్ప్రభూ! ౧౫

ఉ॥ ఒంటిగరావు కష్టములు
　　నూహనసీయవు మీఁద మిక్కిలిగా
జంటగఁ బెక్కుగూడి యొక
　　సారి గమింగఁగల గొట్టునంత మి
త్రింటి తలఁపుగల్గి భయ
　　మేర్పడి చావక చచ్చి మానవుం
దఁటును నీ పదాబ్జమపు
　　దాపదలారు నృసింహ! మత్ప్రభూ! ౧౬

శా॥ నాదైవంబవు, నాగురుండవు, జగ
　　న్నాథుండ వీవంచు నీ
పాదాబ్జామృతపానచిత్తమున నే
　　బ్రార్థింతు, నాదోషముల్
బోదోలం గరుణాప్రసాదమిడి న
　　న్బోషింప రక్షింప ప్ర
హ్లాదాది ప్రముఖాళి పోషక విభూ!
　　లక్ష్మీ నృసింహ ప్రభూ! ౧౭

చ॥ అనుపమ భాగ్యలక్షణ స
మన్వితుగా నొనరింప నాదు నె
మ్మనమున గోరుచుంటివి; ర
మాహృదయేశ! ద్విరూపభాసి నం
హానన నతోత్కరావన! ద
యాకరమూర్తి! కృపాంతరంగ! పా
వనశుభనామ! యాదగిరి
వాస! పరేశ! నృసింహ మత్ప్రభూ! ౧౮

ఉ॥ నచ్చును నొక్కఁడొక్కనికి
నచ్చఁడతండు మఱొండు వ్యక్తికిన్
నచ్చుట నచ్చకుండుట మ
నస్సును బట్టియె యుండుగాన నం
దచ్చెరు వేమి నామనువు
నట్టిద లోకము మెచ్చునట్లు గా
మచ్చరితంబు దిద్దుము ర
మాహృదయేశ! నృసింహ మత్ప్రభూ! ౧౯

చ॥ మనసునబుట్టు నెన్నొ యను
మానము లెన్నొ తలంపు లెన్నొ క
ల్పనలు క్షణక్షణంబున వి
పక్వత నందకమున్నె ప్రమగ్గ వా

ర్ధిని జనియించు బుద్బుద వి
　　　　భిన్నటుగా నమదీప్సితార్థ సి
ద్ధిని బడయన్వరంబిడుము
　　　　దీనుఁడ యాదగిరీంద్ర మత్ప్రభూ! 　　౨౦

ఉ॥ కంటక బంధురంబగు జ
　　　　గంబున విఘ్నలు ముల్లుపోటు త
మ్మంటనిరీతిగా నడతు
　　　　రఘ్నలు తామడుగడ్డునందు పె
క్కంటినిదాకి నెమ్మదిని
　　　　కీడు భరింపగలేక నీ పదం
బంటతరింపఁ జేతువట
　　　　యట్టులె నన్గడదేర్చు మత్ప్రభూ! 　　౨౧

ఉ॥ ప్రాణులు వేలు వేలయిన
　　　　ప్రాణమొకండె యటంచుఁజూపగా
స్థాణువులందు, జంగమము
　　　　స్థావరమందు, జలంబులందు, ని
ద్రాణుల మేలుకొల్ప నవ
　　　　తారములెత్తితి పీ వటంచు పౌ
రాణిక సత్కథల్దెలుపు
　　　　రాజిత యాదగిరీంద్ర మత్ప్రభూ! 　　౨౨

శా॥ స్వాంతంబందున నీ పదాబ్జయుగ మ
శ్రాంతంబు చింతింతు న
త్యంతాసక్తిని విస్మృతింగనక తా
దాత్మ్యంబుఁ బొందన్ భయా
క్రాంతున్, భక్తుని, దీను, నార్తుని, నన్నున్
రక్షింపుమో దేవ! శ్రీ
కాంతావల్లభ! సత్కృపాహృదయ సం
కాశా! నృసింహ ప్రభూ! ౨౩

ఉ॥ రాక్షసవైరి వీవలి పు
రాణములం గలదైనచో హిర
ణ్యాక్ష సహోదరాత్మజుని
నారయ దుష్టుల దుంచి శిష్టులన్
రక్షణ సేయుటేగద ప
రాత్పర! నీదగు ధ్యేయమౌ, జగ
ద్రక్షక! పాహిమాం వరద!
దైష్టిక పోష! నృసింహ మత్ప్రభూ! ౨౪

ఉ॥ నీకృప గల్గియుంట నళి
నీదళలోచన! భావిజీవితం
బాకృతి నొందుదాల్చి హృద
యార్తి నిబాపె; తలంప మిన్నలౌ

నీకృతులెన్న శక్యమె! పు
 నీతునిగా నొనరించియింక నా
ప్రాక్కృత కర్మబంధముల
 బాపుము యాదగిరీంద్ర మత్ప్రభూ! ౨౫

ఉ॥ అంచితభక్తి నీ పదము
 లంటితి, ప్రాక్తన కర్మబద్ధ దు
ష్పంచిత పాప నాశనము
 సల్పి, యభాగ్యుని భాగ్యవంతు గా
వించి మనః ప్రవృత్తులను
 భేదిల జేసి, ముదంబుగూర్చి, య
త్యంచితరీతి బ్రోవుము ద
 యాంబుధి! యాదగిరీంద్ర మత్ప్రభూ! ౨౬

ఉ॥ పుట్టిన పిల్లలిద్దఱను
 పోషణ సేయుటభారమయ్యె ని
ప్పట్టున మాకునొంటరి ని
 వాసము లేర్పడె, యున్కిపట్టు నం
బొట్టకు లేమి యయ్యె మము
 ముంతువొ తేల్తువొ సాటివారికిం
గుట్టును వెల్లడించి వెత
 కుం గురిసేతొ నృసింహ మత్ప్రభూ! ౨౭

మ॥ జరుగంబోయెడు జీవితంబునకునై
సంక్షోభముంజెంది బా
ఉరపాలింటను వైరిగానిలిచి, నా
లోనం, దురూహాపరం
పరలంబెంచితి, వాని బోనడచ భ
వ్యంబైన యుద్యోగ మి
త్తతి నా భార్యకుఁ గూర్చినావు కృప దై
త్యధ్వంస శ్రీ మత్ప్రభూ! ౨౮

ఉ॥ చిత్తమునందు సంస్మరణ
సేయు తలంపు, కరద్వయంబునం
బత్తిని పాదపూజ సలు
పంగలశక్తియు, దర్శనార్థమై
సత్తువ కన్నుదోయికిని,
సత్పథ వర్తన మాత్మకిచ్చి, నీ
సత్తెము చాటవేడెద ల
సద్గుణధామ! నృసింహ మత్ప్రభూ! ౨౯.

చ॥ అవిరళ వాంఛితార్థముల
నారసి సిద్ధినొసంగుచుంట, న
వ్యవధిని భక్తకోటి భవ
దాశ్రిత యాదధరాధరంబుపై

భువియ ప్రసూతియైనటుల
　　　　పొందుగఁజేరి భజించుచుణ్ పురా
భవ కృతదోషము క్తమయి
　　　　వర్తిలుచుండు నృసింహ మత్ప్రభూ! ３౦

మ॥ తొలిజన్మంబుననేమి చేసితినో త
　　　　ద్దోషంబుఁబోనాడ నీ
మలిజన్మంబున నేమి చేయవలెనో
　　　　మాయావులైనట్టి లో
కులతోనిండిన లోకమందు సుకృతాం
　　　　కూరంబులేరీతిగా
లలితోరుప్రభనొందునో తెలుపుమా!
　　　　లక్ష్మీనృసింహా ప్రభూ! ３౧

మ॥ పదునై దేడుల ప్రాయమందుననె ల
　　　　భ్యంబయ్యె నుద్యోగ మా
పిదపన్గల్గిన యాపదాళివలనం
　　　　బెంబేదనై యిప్డు నీ
పదపంకేరుహమే శరణ్యమని సం
　　　　భావించి సంపూర్ణ సం
పదలన్మక్కువతోడ గూర్చి మనుపం
　　　　బ్రార్థింతు శ్రీ మత్ప్రభూ! ３౨

చ॥ కులమతభేద మొండొకటి
గూర్చిరి పెద్దలు, తద్రహస్యముం
దెలియగలేను, వైరముల
తీరు గణింపగ మానవత్వమే
యిలపయి మృగ్యమైనటుల
నెంచెదఁగాన విభేదరూపముం
దలపక శైవవైష్ణవ ప
థంబున గొల్తు నృసింహ మత్ప్రభూ! ౩౩

శా॥ ఇందెందుంగలఁడందులేడు మఱి యిం
కెందెందు నున్నాడొ గో
విందుం డందువు దానవేశ! జగమే
విష్ణుస్వరూపంబు నీ
సందేహంబులు మానుమంచు పలుకన్
స్తంభంబునంబుట్టి యా
నందాబ్ధి న్నిజభక్తుఁదేల్చితివి వి
న్నాణంబుగా మత్ప్రభూ! ౩౪

చ॥ కవివరగాయకోత్తములు
కంఠములంబెకలించి మించి సం
స్తవమొనరింప బూనిరి, స
దా మహదాశయ హృష్టచిత్తులై

పరివిమలగాఢ భక్తి మెయి
వాంఛితసస్యము లుల్లసిల్లగా
భవదచలాలయ ప్రభలు
ప్రాక దిగంతములందు మత్ప్రభూ! ౩౫

ఉ॥ జారిన యాత్మగౌరవము
చక్కనదిద్ది, స్వకీయనూత్న సం
సారమహాబ్ధి సంతరణ
సాధనమొండొనగూర్చి, చిత్త సం
స్కారమొనర్చి, నీ భజన
సల్ప హృషీకముశక్తి నిల్పి, పే
సారక సాకుమయ్య నను
సన్నుత యాదగిరీంద్ర మత్ప్రభూ! ౩౬

శా॥ దారిద్ర్యంబును నార్చి, చిత్తమునకుఁ
ధైర్యంబుచేకూర్చి, ని
స్సారంబైన మదీయ జీవన తరు
చ్ఛాయాశ్రిత శ్రేణి కిం
పారన్మోదముపేర్చి, మానసము వి
స్ఫారంగ నూరార్చి, లో
కారాధ్యా! ననుబ్రోవు మెల్లపుడు యా
దాద్రీశ! శ్రీ మత్ప్రభూ! ౩౭

మ॥ అనిమిత్తంబుగ మద్గృహంబునకు రా
డాసక్తితో నెవ్వడుఁ
అనిమిత్తంబుగ భక్తుఁడెవ్వఁడును నీ
యాదాద్రికిఁ రాడు పా
వననామా! జనులెల్ల స్వార్థపరులై
వర్తిల్లు చున్నారలం
దున నేనొక్కఁడ పోషింపుమా కరుణ నఁ
దోషఘ్న శ్రీ మత్ప్రభూ! ३౮

ఉ॥ తిమ్మని బ్రహ్మిగా, మిగుల
దేబెను దిట్టగ, రైతు రాజుగాఁ,
దిమ్మరి కార్యశూరునిగ,
రేవని పావను, నజ్ఞు విజ్ఞు, ద
ద్దమ్మను శూరు, లోభిని ను
దారు, కుచేలు కుబేరుఁ, జేతు వీ
వమ్మకచెల్ల! నన్నును పు
మట్టుల యాదగిరీంద్ర మత్ప్రభూ! ३౯

చ॥ పరిపరి రీతులన్మనసు
పర్వెడు, నిశ్చలభక్తితోడ నీ
చరణములంటి, యర్చనను
సల్పగ, వందనమాచరించ, దా

స్వరతిని దేల, సఖ్యమున
నాత్మనివేదనముం బొనర్చ నీ
దరి సెనమిచ్చి యేలుము. వి
తాంతము యాదగిరీంద్ర మత్ప్రభూ! ౪౦

మ॥ అరిషడ్వర్గ కృతప్రలంభన ధరా
యాసార్త చిత్తంబు, పె
న్గొలతంబొంది, కలంగి, నెవ్వ: గమిడీ
కోడస్సి, గొల్లెత్తి, తా
మొఱపెట్టెన్మను బట్టు చేతగమియ
న్మన్నీటిలో ముగ్గి శ్రీ
నర పంచానన! యొడ్డు జేర్చి కృప న
న్గాపాడుమా మత్ప్రభూ! ౪౧

మ॥ అనుకూల ప్రతికూల మార్గముల న
న్యాపత్తులం భాగులై
యనువర్తింతుర పరోపకారి, పరకా
ర్యధ్వంసు లధ్వంబు లిం
దునవేరైనను కార్యమొందగుట సం
స్తుత్యర్హులే. వీరు, కా
వున బోషింపుము వారితోడ నను సం
పూర్ణ ప్రీతమ్మత్ప్రభూ! ౪౨

ఉ॥ నవ్విన, కవ్వినం, బగతు
నమ్మిన, హృచ్ఛలనంబు నిల్పినన్,
ద్రెవ్వీన, క్రొవ్విన, న్మెఱపు
దివ్వెల తీవెలనంటుకొన్న, కా
ల్దువ్విన, బువ్వనంటిన, మ
దంబున కాఱులుబోల్త గొట్టినన్
ఎవ్విధినైన తప్పదు మ
ఱెందుకు చావుభయంబు మత్ప్రభూ! ౪౩

ఉ॥ పిల్లల కాయువున్మఱియు
పెంపెసలారెడు స్వాస్థ్యమిచ్చి, మా
యుల్లము సంతసించగను
నూఱటనంది, విధి పరిహారణన్
జల్లగఁజేయు భాగ్యము నొ
సఁగుము నిత్యవిచారదూరమై
యల్లన నీ పదాబ్జముల
నంటుదు యాదగిరీంద్ర మత్ప్రభూ! ౪౪

ఉ॥ చెప్పులవర్షముం గురియఁ
జేసిరి శాసనమందిరంబునం
జొప్పడ వంగరాష్ట్రమున
చోద్యముగా సచివాగ్రగణ్యు లిం

కొప్పును రామరాజ్యము; మ
హోన్నతి పాదుకలేలుచుఁట మా
కెప్పుడు; నాయకాగ్రిణుల
యీవికతంబు నృసింహ మత్ప్రభూ! ౪౫

శా॥ లంకామంత్రిని కూర్రుఁడెవ్వఁడో రివా
ల్వత్రేల్చి మువ్మారు శే
షాంకుంజేసెనటన్న వార్త భయదం
బై భారతంబందు న
ల్వంకల్ర్బాకెను రామరాజ్యమిఁక సం
ప్రాప్తించునా యంచెదఁ
శంకాతంకము గల్గె సాధుజన ర
క్షాదీక్ష! శ్రీ మత్ప్రభూ! ౪౬

మ॥ వ్యవహారంబున ఛద్మవేషకుల దు
ర్వ్యాపారముంజేసి నే
నవమానంబును నొందుచుండుటయె గా
దర్థంబుఁ బోనాడి మా
నవసంఘంబున మన్కి నాయెడల పు
న్నామంబుగాఁ దోచె గౌ
రవమర్యాదలు లేమి; కావగ నిసుం
బార్థింతు శ్రీ మత్ప్రభూ! ౪౭

ఉ॥ శాంతినిగూర్చి నా మనసు
చక్కనదిద్దుము. నేను గొప్ప వే
దాంతినిగాను. లౌకికుఁడ
దారసుతాదులయందు ప్రేమ మ
త్యంతము. దూరవాసము ప్ర
యాసముగాన దయాతరంగిత
స్వాంతము బూని సాకుమవి
సాగిలి మ్రొక్కెద నిచ్చలున్ప్రభూ! ౪౮

ఉ॥ అర్థిక చింతనంబు హృద
యంబును డిందు నొనర్పబూన స
ర్వార్థములిచ్చి. భక్తుని గృ
హంబున నిల్పి కిరాయదారునిఁ
సార్థుని జేసినాడవు ద
యాంబుధి! నీ స్మరణైక చిత్తమ
భ్యర్థనజేతు దాని విడి
పాలనజేయు నృసింహ మత్ప్రభూ! ౪౯

శా॥ ఎన్నో కోర్కెలు, నెన్నొ కాంక్షలు, మఱిం
కెన్నో మనోభీష్టముల్
ఎన్నో వాంఛలు, నెన్నొ యీప్సితము లిం
కెన్నో మహాకాంక్షలుఁ

ఎన్నో నిత్తువు భక్తకోటికి వరం
బీయంగ లోటుండునే
నన్నీ సంసృతి కంధి తేల్చు మదియే
నాకాంత శ్రీ మత్ప్రభూ ! ౫౦

మ॥ నరసింహుండవు నీవు దేవుఁడవు నా
నారూపముల్దాల్చి వీ
వరయన్భక్తులగాచి ముక్తి నిడగా
యాదాఖ్యచే నొప్పు శ్రీ
గిరివాసంబు నొనర్చినావనుచు నే
కేలోమ్మిడ్చి చాటించెదన్
నరసింహుండను నేను భక్తుఁడను న
న్గాపాడుమా మత్ప్రభూ ! ౫౧

ఉ॥ నిశ్చలభక్తి విన్గొలువ
నేను గడంగిన చిత్తమెందుకో
పశ్చిమమార్గమున్గనగఁ
బాల్పడు నింద్రియబద్ధమౌటచే
దుశ్చరితంబు మానదు బు
ధుల్పచియింతురు బుద్ధిచెప్పఁడున్
వృశ్చికచాలనంబనుచు
వేడెద దిద్ద నృసింహ మత్ప్రభూ ! ౫౨

చ॥ స్థిరమగు బుద్ధిగల్గుటకుఁ
జేయుదు పూజలనెన్నియేని నా
తరమగునన్ని; చిత్తమను
తత్తడి గంతులకాగనేర కే
మరతునొ నిన్నటంచు నను
మానము గల్గెడు గాన నీవు చె
చ్చెర కృపగావవే వరద!
శ్రీయుత! యాదగిరీంద్ర మత్ప్రభూ! ౫౩

చ॥ జలనిధి సొచ్చి సోమకుని
చంపి విరించికి నిచ్చినావు ప్రా
బలుకులు మత్స్యరూపమున;
వారిధి త్రచ్చగ దేవదానవుల్
వెలసితి కూర్మరూపమున
వెన్నునదాల్చితి మందరాద్రి; భూ
లలనను ఘోణిరూపమున
లాలనజేసితి వీవు మత్ప్రభూ! ౫౪

చ॥ బలిమికి తాళలేని నిజ
భక్తుని గావగ కంబమందునన్
పొలిచి వెసన్ హిరణ్యకశిపున్,
పొరిగొంటి నృసింహమూర్తివై

బలిని పదత్రియంబడిగి
పాదము నొక్కటి నెత్తి మోపి వి
హ్వాలునిగ సల్పి త్రొక్కితివి
వామన రూపముదాల్చి మత్ప్రభూ! ౨౨

చ॥ ఇల నరపాలుర స్సునిమి
తిర్వదిపై నొకసారి గండ్రగొ
డ్డలి భుజమందు బూని, విక
టంబుగ భూసురులెల్ల మెచ్చ. మై
థిలిని వివాహమాడి వన
తీరములం దిరుగాడి రావణా
దుల దునుమాడి కూర్చితివి
తోషము మాకు నృసింహ మత్ప్రభూ! ౨౭

చ॥ వెలసితి ధర్మమున్నిలుప
వెన్నుఁడవై చెఱసాలలోన. మా
తులుని వధించి పార్థునకు
తోడుగనిల్చి రణంబునందు క
ర్మల నొనరించుటం గలుఁగు
మర్మము తెల్పి యనేక రాక్షసా
వళి బరిమార్చినావు యదు
వంశ వరేణ్య! నృసింహ మత్ప్రభూ! ౨౮

చ॥ ఇలపయి శాంతి సత్యము, అ
హింస తరించెడు గాదె జీవితం
బులనని బుద్ధరూపమున
బోధన సల్పితి వింక కల్కివై
కలియుగమందు పుట్టువును
గాంచెద వంచుఁ బురాణ సత్కథల్
తెలిపెడు నీ మహాత్వము, ను
తింపగలేను నృసింహ మత్ప్రభూ! ౫౭

శా॥ ఏ రూపంబున నిన్ను గొల్తు మదిలో
నే రూపు ధ్యానింతు ని
న్నే రూపంబున గాంతు నీ యణువు రూ
పేదో మహా రూపమే
దో రాజీవదళాయతాక్ష! కడు ము
గ్ధుండన్ భవత్పాద ప
ద్మోరుస్వాదురసామృతంబు నిడు న
న్నోమన్ నృసింహ ప్రభూ! ౫౮

ఉ॥ కాయము సల్పుమా కులిశ
కాయముగాగ, సుఖప్రదంబు దీ
ర్ఘాయు వొసంగుమా నిజ సు
తాదుల కాత్మకు స్వీయపత్నికిన్

శ్రీయును, ధీయు, గౌరవము,
చెల్వమురాగము సత్యవృత్తియుం
బాయని త్వత్పదాంబురుహ
భక్తియు, నిమ్ము నృసింహ మత్ప్రభూ! ౬౦

మ॥ సమతాభావము, సత్యశీలము, సమ
స్త ప్రజ్ఞల న్నేర్పు, స
త్క్రమవాల్లభ్యము, సామరస్యము, సదా
కారుణ్య భావంబు, హృ
ద్యమునౌ త్వత్పదపద్మపూజనమునం
దాసక్తి నాకిమ్ము శ్రీ
రమణీ చిత్తవిలాస విభ్రమ శరీ
రా! నారసింహ ప్రభూ! ౬౧

ఉ॥ పత్రమొ, పుష్పమో, ఫలమొ
భక్తిసమర్పణ సేయువారి తా
పత్రయ దాహమార్చి యురి
బాపెదవంట నిజంబొ కాదొ యే
మాత్ర మెఱుంగ నాకదనొ
మానవ మొక్కటి తప్ప నీకిడం
బాత్రమునైన వస్తువు[illegible]
భక్తికుసుమంబు నృసింహ మత్ప్రభూ! ౬౨

ఉ॥ దారుణి వామపార్శ్వమున
దక్షిణ పార్శ్వమునందు లక్ష్మి యిం
పారగఁ జేరి కొల్వగ నొ
య్యారముగా కడగంటి చూపుతో
నారసి కల్వమైత్రి కమ
లాప్తతఁ దెల్పు భవద్విలాసముల్
సారెకు సారెకున్మదిని
సంస్మరణం బొనరింతు మత్ప్రభూ! ౬౩

ఉ॥ ఆపద సంభవించెను మ
దాత్మజ ప్రాణము వాయునట్లు నీ
కాపుదనంబునం దిరిగి
కన్నుల గాంచెడు భాగ్యమబ్బె నే
లోపము భక్తిలోన నవ
లోకన జేసియు శిక్ష నిచ్చితో
పాపకు నిందు స్వాస్థ్యమిడి
పాలన జేయు నృసింహ మత్ప్రభూ! ౬౪

చ॥ నిను గను కాంక్ష పద్యముల
నేర్పుమెయి న్రచియించి హాని బ
త్తిని నొక గ్రంథ రూపమున
తీరికగా లిఖియింపఁబూను నం

తన, కను జోడు, మాయమయి
తావక పాదములగా స్మరింప త
త్క్షణమ లభించె నీ మహిమ
గాంచ నశక్తుఁడ శ్రీశ! మత్ప్రభూ! ౬౫

ఉ॥ మోసము చేయు ప్రాజ్ఞులు న
మోదయినారు జగంబునందు, వి
శ్వాసము శూన్యమయ్యె, మను
జత్వము క్రమ్మగ్గెను, ద్రోహచింత నా
వాసన పర్వె నెల్లెడల,
పాపము వర్ధిలె, నిచ్చి తెమ్మ నం
గాసులు తుప్పిమ్మచుండి రెటు
గాచెదొ నన్ను నృసింహ మత్ప్రభూ! ౬౬

శా॥ రంగత్తుంగతరంగ డోలికల తో
రంబోలలాడించు శ్రీ
గంగా గౌతమి పుణ్య తీరమున ప్రి
ఖ్యాతాంధ్ర సద్బ్రాహ్మణో
త్సంగాంగీకృత మంత్రకూటపురి వా
సంబొప్పె నాకిప్పు డ
ర్ధాంగీవాసము కారణంబు సుకృతం
బబ్బెగా నృసింహ ప్రభూ! ౬౭

ఉ॥ గురువుల బోధ తత్త్వముల
 గోప్య మెఱింగి, త్వదీయ పాదపం
కరుహము నాత్మనిల్పి, మమ
 కారముడుల్ల ముముక్షుమార్గ మా
చరణమొనర్చు చిత్తము నొ
 సంగుము జన్మతరింప పాపముల్
తరుగ, నిరంతరంబు సుకృ
 తంబు లొనర్చ నృసింహ మత్ప్రభూ! ౬౮

మ॥ విషయాసక్తుఁడనై చరించితిని, వి
 ర్వీర్యుండనైతిఁ భవ
ద్విషయాసక్తి లభించె దోషముల న
 న్వేషింప కాత్మీయుగా
విషమాభ్యాసుని దిద్ది బ్రోవుము ననుఁ
 బ్రీతిఁ జగద్రక్షకా!
విషయాతీత! నిరంజనాచ్యుత! పరా!
 విశ్వంభరా మత్ప్రభూ! ౬౯

చ॥ గడచెను నేఁబదేడులు సు
 ఖంబున దుఃఖము, లాభనష్టముల్
ఉడుకును జల్వయుం, గెలుపు
 నోటమి, యందు సమత్వభావ మే

ర్పడదు మనస్సునందు నిఁక
రాగల కాలమునందు గల్గునా?
తడయక కావుమా నను, ము
దంచితరీతి నృసింహ మత్ప్రభూ! ౭౦

చ॥ కనగల కన్నుదోయి విన
గల్గదు. వీనులుచూడలేవు. చా
లన కనువైన పాద మవ
లంబన సల్పదు చేతిచెయ్దముల్,
పొనరదు చేతితోనడక
పొందదు నాలుక స్వాదువాసనల్
కనదు భవద్విలాసముల
కాముకుఁడాత్మ నృసింహ మత్ప్రభూ! ౭౧

ఉ॥ భూసురపంశ వార్నిధిని
బుట్టి పఠింపకపోతి వేదముల్
మీసరమైన శాస్త్రములు
మేల్మి పురాణ నిరుక్త భాష్యముల్
దోసిలి నిండ నీరయిన
తోయజమిత్రునకీయనైతి నా
దోసములన్ క్షమించి కృప
తో దరిజేర్పు నృసింహ మత్ప్రభూ! ౭౨

శా॥ పూర్ణంబయ్యది, పూర్ణమిద్ది, కలుగుం
బూర్ణంబు పూర్ణంబునన్
పూర్ణంబందున పూర్ణముఙ్గొనినచో
పూర్ణంబె శేషించు, న
న్వర్ణార్థామృత మాధురిందనిసి యె
వ్వండొందు నానందమున్
పూర్ణండాతఁ దటంచుఁ దెల్పు నిగమం
బుల్ శ్రీ నృసింహ ప్రభూ! ౭౩

ఉ॥ కర్మల నాచరించుచు జ
గంబున వర్షశతంబుమన్కి స
ద్ధర్మము, జన్మమందియు న
ధర్ముఁడు, నాత్మ విఘాతకుండు దు
ష్కర్మను దైత్యయోనిని, ప్ర
కాశమునందఁడు; కాన జ్ఞానిగా
నిర్మల చిత్త వృత్తి నిను
నిల్పెద నాత్మ నృసింహ మత్ప్రభూ! ౭౪

చ॥ కదలిక లేనిదై, మనసు
కన్నను మిన్నగ వేగవంతమై,
పదపడి యింద్రియాదులకు
పట్టన కందనిదై, యవర్ణమై,

సదనమునందు ప్రాణులను
చాలనజేయఁ నద్దై, పటిష్టమై,
అదనున దా వెలింగెడు మ
దాత్మనొసంగెద నీకు మత్ప్రభూ! ౭౫

మ॥ కనుమా సత్యము ఖంబు మేలయిన బం
గారంపు పాత్రంబుతో
కనరానట్టులు క్రాంతమై వెలసె నా
కైవాయి కట్టూడ్చి త
ద్ఘన కాంతిం బ్రకటింపుమా హృదయ
కాంతిర్ద్ర నెంతేనియుఁ
నిను ధ్యానింతు క్షణక్షణంబు మదిలో
నిత్యాత్మ శ్రీ మత్ప్రభూ! ౭౬

ఉ॥ ఎవ్వఁడ నన్యచిత్తత త్వ
దేకమతిఁ భజియించు వానికిఁ
చివ్వలుబాపి యోగమును
క్షేమము గూర్తునటంచు పల్కు వే
మవ్వపుభక్తితోడ నిను
మానసమందుఁ దలంతు నెప్పుడీ
వెవ్విధి బాధలార్చి నను
నేలెదొ యాదగిరీంద్ర మత్ప్రభూ! ౭౭

ఉ॥ సన్నని లేత తీవియకు
జన్మమునంది, మదాళిసంహతుల్
సున్నితమైన తత్తనువు
శోభ; యశంబు; నుతింప దేవతా
భ్యున్నతినంది వారి తల
భూషణమై యలరారు పూలదే
పున్నెము పున్నెమంచు తల
పోయుదు నాత్మ నృసింహ మత్ప్రభూ! ౭౨

మ॥ తమలో పుణ్యజలప్రవాహములకుం
దావిచ్చి, మౌనీంద్ర బృం
దముజేరంగ నివాసమేర్పఱచి భు
క్తంబిచ్చి, దేవాళి నె
త్తమునన్నిల్పి, లతాళికౌగిళులచే
తారాపథంబంటు వృ
క్షములంగల్గి శుభంబుగూర్చు గిరివ
ర్గంబెంతు శ్రీ మత్ప్రభూ! ౭౩

మ॥ మరుమూలం జనియించి, బంధువుల సం
బంధంబుచే నుబ్బి, సా
గరపర్యంతము పర్విబ్బి, తీరముల కు
గ్రామావళీగ్రాసపుం

గౌలితం దీరిచి, పుణ్యతీర్థములు నా
　　　　కొండాడగా నొప్పి, నీ
చరణద్వంద్వమునంటు హీనుల పవి
　　　　త్రాపింతు శ్రీ మత్ప్రభూ! ౭౦

ఉ॥ పండుగలాచరింతురు సు
　　　　పర్వల పేరిట నెన్నియెన్నియో
తిండికిగా లభించునని
　　　　తియ్యని భక్ష్యము భోజ్యచోష్యముల్
నిండుమనంబునం గొలువ
　　　　నేర్చిన నిన్ను దినంబు పండువే
దండము బత్తిపెట్ట పర
　　　　తంత్రము లాడకయున్నె మత్ప్రభూ! ౭౧

మ॥ అనపత్యుండు సపుత్త్రికుండగుట, రో
　　　　గార్తుండు నీరోగుఁడై
పునరుజ్జీవన మందగల్గుట, చెఱం
　　　　బోనాది బందీకృతుం
డనఘుండౌట, క్షణపరిమోదము త్వదీ
　　　　యానల్ప కారుణ్య సం
జనితామోదము శాశ్వతంబు, జగదీ
　　　　శా! శ్రీ నృసింహ ప్రభూ! ౭౨

చ॥ కడుకొని తీర్థ రాజములఁ
గాఁచగలేదు, మహోఘపంకముం
దుడువగలేదు వాహినుల
తోయములందు మునింగి, భక్తితో
నెడపక దాన ధర్మముల
నీయగలేదు, తరించుటెట్టులో
ముదివడు జీవితంబునకు
ముక్తినొసంగు నృసింహ మత్ప్రభూ! ౭౩

ఉ॥ పుట్టినదాది నిప్పటికి
పుట్టెడు దుర్వ్యసనంబులాత్మకుం
బెట్టనికోటలై నిలిచె
పెద్దలు సుద్దులుచెప్పఁబూన నూ
కొట్టుటెగాని యాచరణ
కుం దలపెట్టుట గిట్టదింత, ని
ప్పట్టున నీపదద్వయము
పట్టితి పావనుజేయు మత్ప్రభూ! ౭౪

ఉ॥ కోరికలుండరాదనుచు
కోరుట సైతము కోర్కెయంచు నే
నారయ, మోహలోభత, మ
దాత్మకనాగము మత్సరోగ్రి ఘీం

కారముచేసి క్రోధమున
　　　　కాయనగం బగలించెదుగా బ్రీతీ
కారము సేయ స్వప్నమున
　　　　గన్పడు యాదగిరీంద్ర మత్ప్రభూ! ౭౫

మ॥ దురహంకారకనామ విస్తృత మహో
　　　　త్తుంగోర్మి భంగార్భటీ
భరితాంభోనిధి నాదు మానస మదే
　　　　భంబుగ్రి కుంభీర భీ
కర దంష్ట్రాహతి జిక్కి స్రుక్కి కడు నా
　　　　క్రిందించుచుండెన్ భవ
చ్చరణంబే శరణంబుగాఁ దలఁతు మో
　　　　క్షంబిమ్ము శ్రీ మత్ప్రభూ! ౭౬

మ॥ ధరనీశాంతము, నీదు నీకృప, బృహ
　　　　ద్భానుండు తేజంబుఁ దె
మ్మెర విష్ణుత్వము, నంబరంబవిదితో
　　　　న్మేషాన్వితాకారముల్
నిరతంబు న్నుతి సేయుచుండునుగదా
　　　　నేనెంతవాఁడన్ భవ
చ్చరణాంభోరుహ మాశ్రయింతు జగదీ
　　　　శా! శ్రీ నృసింహ ప్రభూ! ౭౭

చ॥ తలకొని బత్తి నీ యడుగు
దమ్ముల చిత్తము హత్తజేయగా
బలమున లాగుచో మగుడ
బాఱెడు రబ్బరుముక్కపోల్కి తా
నిలువక తొంటి బంధమున
నీల్గెడు నిచ్చలు ప్రొద్దుపుచ్చుచుం
గలవరపాటు మాన్పి నను
గావుము యాదగిరీంద్ర మత్ప్రభూ! ౭౭

ఉ॥ తుమ్మెద ఝుమ్మఝుమ్మనుచు
తోటలలోగల పూవుపూవునం
దిమ్మరి బొట్టుబొట్టుగొని
దెచ్చిన దానిని తేనెయంచు లో
కమ్మను. బిందువొందునొకొ
జ్ఞానము నే విరిదాననంచు జీ
వమ్ములలోన నాత్మయటు
వర్తిలు యాదగిరీంద్ర మత్ప్రభూ! ౭౮

మ॥ నినుపూజించు తలంపుతో జడమతి
న్నీరంబులంజొచ్చి. కా
ననముల్ద్రిమ్మరి. కొండలెక్కి శ్రమచే
నట్టాడి. శుష్కించి కొ్రి

న్ననలార్జింపక హాయిగా హృదయ సూ
నంబిత్తు గైకొమ్ము స
జ్జనలోకావన వంద్య యాదగిరి వా
సా! శ్రీ నృసింహ ప్రభూ! ౭౦

ఉ॥ పట్టిన కొద్దిపాటి జల
పానమొనర్చును కుండ. కుండలోఁ
బుట్టినవాఁడు సంద్రములు
పుక్కిటబట్టెను. దీనిలోన చూ
పట్టెడు తండ్రికన్న బహు
భంగులబిడ్డడె మిన్నయంచు. నే
పుట్టగనేమి సిద్ధితతిఁ
బొందని పుట్టువు శ్రీశ! మత్ప్రభూ! ౭౧

మ॥ కనుచున్నాఁడను కన్నులున్న ఫలముం
గాంక్షించి; పేర్మిమోర్వి సం
జనితోద్యానతలంబులం, గొలఁకులన్,
సౌధంబుల న్వేదులన్,
ఘనశీతానిల వీచులన్. మధురపై
కస్వానముం; గాని లో
గన హృద్ద్యోతక కౌముదిన్ దయనొసం
గన్ రాదె శ్రీ మత్ప్రభూ! ౭౨

ఉ॥ కొందఱిహంబునం దెదియొ
గొప్పపనుల్ రచియింత్రు సద్యశం
బందగ, కొందఱో పరము
నందగ సత్క్రియలాచరింత్రు, నీ
యందు భరోసచేసి ఇహప
రార్థపు కర్జములన్నిమాని నే
పొందుగ నిద్రపోయెదను
మోయుము భారము నీవె మత్ప్రభూ! ౯౩

శా॥ ఆనందంబున ప్రాణికోటి జననం
బందున్ బ్రవర్ధిల్లు, తా
నానందంబున గిట్టి లీనమగు నా
యానందమందెప్పు డ
య్యానందంబును బ్రహ్మమే యనుచు వే
దాంతంబు ఘోషించు బ్ర
హ్మానందంబు నెఱుంగుటెట్టులో గదా
యాదాద్రి వాసా! ప్రభూ! ౯౪

ఉ॥ ఉత్తమరీతి రాజ్యము సు
యోధనుఁడేలె, దశాస్యుఁడన్న నో
చిత్తము మిత్తిగొంగ పయి
జేర్చె, జగంబటులయ్యు వారి పే

రెత్తదు మంచిలోన కత
మేమి? మనఱ్ఱుచిలేదు గావునం
బుత్తడిమేనుకన్న పరి
పూతమనంబది మిన్న మత్ప్రభూ! ౯౫

ఉ॥ ఎక్కడ? నేమి? యెప్పుడు? మ
ఱెందుల? కెట్టుల? నెవ్వరన్న? బ
ల్చిక్కని వారులాడుగురు
చాటుదు రాత్మవిచారమందు తై
తక్కలనాడు ప్రాణులకు
తాత్మపథంబు. తథానువర్తులై
చిక్కులులేక నింగదియ
జేరుదురున్నతినంది మత్ప్రభూ! ౯౬

ఉ॥ ఎక్కడినుండి రాక? యిటు
లెక్కడికీ పయనంబు? వచ్చి నీ
విక్కడనేమి చేసితివి?
యెందుల? కెవ్వరు పంపినారు? చే
జిక్కినదేమి? యంచడుగ
చిందులు ద్రొక్కుమనంబు నెట్టు లే
పక్కని శాంతిగూర్చి పరి
పాలనజేసెదో శ్రీశ! మత్ప్రభూ! ౯౭

ఉ॥ ముప్పిరికూట మీ ప్రకృతి
ముప్పిరినంటనివాఁడ వీవు, నే
ముప్పిరిదాసుఁడ న్వడివి
ముప్పునగల్గిన ముప్పుతిప్పలున్
ముప్పిరి గొంటచే జడిసి
ముక్తినొసంగగ మ్రొక్కుచుంటి, నీ
గొప్పదనంబు తేటపడ
గూర్పుశుభంబు నృసింహ మత్ప్రభూ! ౭౦

చ॥ ఒకపరి సత్క్రియాచరణ
కూహజనించు, మఱొక్కమారు నీ
వికటజగంబు పోకడల
వీక్షణచే వికృతింబొసంగు, నే
ర్పొక యిసుమంతలేకునికి
యొప్పిన నొప్పకయున్న కర్జమే
నకలుషరీతి సల్పుదు ద
యాంబుధి! యాదగిరీంద్ర మత్ప్రభూ! ౭౧

చ॥ సుకృతము లెన్ని చేసినను
చొప్పడకుండిన కాలమేర్పడన్
వికృతముగాఁ దలంచు, నవి
వేకి, తలంపడె? యద్ది వానికిన్

ప్రకృతిగుణంబు; గాన పరి
పంథియెఱుంగునె యెగ్గులగ్గు లీ
ప్రకృతివి, గాదె దుర్లభ మ
పారకృపానిధి! శ్రీశ! మత్ప్రభూ! ౧౦౦

చ॥ జగతిని నిండియున్న పలు
సంపదలందు దురాశవీడి, చ
క్కఁగ తొలి భాగ్యహేతువున
గల్గినవానిని నీశ్వరార్పణం
బుగఁ దలపోసి యాపిదప
బొందుము నీవని పల్కె వేదమ
య్యగణితసూక్తి నేమరను
యాదగిరీంద్ర నృసింహ మత్ప్రభూ! ౧౦౧

మ॥ ఇది స్వార్థోత్కయుగంబు నిందు జను
లే యేవేళ నెవ్వానినిఁ
హృదినొప్పారు మనోరథౌఘముల నీ
డేర్పఁ బలోపేతుగా
మదిలోనెంతురొ వాని నాయకునిగా
మన్నింతు రానాయకుం
డది గుర్తింపదె యెన్నుకొన్న పిదపఁ
యాదాద్రి శ్రీ మత్ప్రభూ! ౧౦౨

చ॥ పితరులసేవ మించ, గల
　　　　పెఁ సుకృతం బొకడున్నె ! జీవితం
బతుకులబొంత యౌట మన
　　　　సారనొనర్పగ నైతి; గాన శా
శ్వతముగ స్వర్గమందె కొలు
　　　　వంగల యొండువరంబు నిమ్ము, ఆ
యతకరుణానిధీ ! వరద !
　　　　యాదగిరీంద్ర ! నృసింహ మత్ప్రభూ ! ౧౦౩

చ॥ ఎదయను హోమకుండమున
　　　　నీర్ష్యకరీషపుటింగలంబు పెం
పొదవ, నహంకృతీంధనము
　　　　నుత్సుకతాజ్యమునందు వేల్చి నే
నదరక నాత్మయజ్ఞమున
　　　　నాహుతులిచ్చెద నీదునామ మిం
పొదవగబుక్కఁగాజదివి
　　　　యొద్దికగొమ్ము నృసింహ మత్ప్రభూ ! ౧౦౪

చ॥ మఱిమఱి పుట్టిగిట్టెదు ర
　　　　మాసహజన్మ; మృతండమానులే
వరములఁబొందినారొ భవ
　　　　బంధవిముక్తులు గాకయుండియుఁ

గురుతర కాంతిపుంజముల
　　గుప్పుదు రంధతమస్సు బాయగా
నరయ కొలంది యున్నె మహ
　　దాశ్రయకోటికి శ్రీశ! మత్ప్రభూ! ౧౦౫

ఉ॥ వాసనగల్గు పుష్పము లె
　　వారయినం దలలో ధరింతు రా
వాసన నిగ్గుతగ్గ పసి
　　బాలురుగూడ తలంప రంటగా
మాసినమాలయైన వన
　　మాలికి నప్రియమౌనె? శ్రీశ! గో
దాసుమనః ప్రకాశ! పర
　　ధామనివాస! నృసింహ మత్ప్రభూ! ౧౦౬

చ॥ అలఘు కవీంద్ర కోకిలల
　　కాలయమై, సుకుమార కావ్యక
న్యల నటనా విలాసముల
　　కాకరమై, పురుషార్థ సాధనా
ఫలముల కాలవాలమయి
　　ప్రాభవమందిన యోరుగల్లు మం
జులవనవాటి పూసిన ప్ర
　　సూనము నీ కృతిగొమ్ము మత్ప్రభూ! ౧౦౭

# మంగళము హా శ్రీ వృత్తము

శ్రీమహిత! భక్తజన — సేవితపదాంబురుహా!
చిన్మయసురూప నరసింహా!
కోమల సరోవర ని — కుంజవృత యాదగిరి
గోపుర నివాస నరసింహా!
కామితవరప్రదని — కాయ! రమణీయవర
కాయ! మహనీయ నరసింహా!
దాముల హరించి, గురు — బాధ్యతవహించి, భవ
బంధముల త్రుంచు నరసింహా! ౧౦౮

—: ఓం తత్సత్ :—



# కావ్యగానము - చర్చ

★

గోలకొండ పత్రిక ది. 21-12-1959.

## శతక కవులు ఉత్తమ తరగతి వారే

### కావ్యగాన సభలో అభిప్రాయము.

శ్రీ విశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాల పక్షమున శ్రీ విశ్వనాథ వేంకటేశ్వర్ల అధ్యక్షతన శ్రీ చొల్లేటి నృసింహశర్మ, తాము ఇటీవల రచించిన శ్రీయాదగిరి లక్ష్మీనృసింహస్వామి శతకము, కావ్యగానము 17 వ తేదీన జరిపారు. ప్రిన్సిపాలు శ్రీ శర్మను పరిచయముచేయుచు కవుల సన్మానింపజాలకున్నను, వారి రచనల నైన ప్రోత్సహించుట కళాశాల ధ్యేయ మన్నారు.

శ్రీ ఉదయరాజు శేషగిరిరావు శ్రీ శర్మ కవిత్వము నూతన ప్రయోగము లతో గూడుకొని ధారాళముగా నడచినదనిరి. శ్రీ చిలకమర్రి రామానుజాచార్యులు కవి శతకమందే స్పష్టముగా గోచరించుననియు, శ్రీ శర్మ ఆవేదన, భక్తిపారవశ్యము, పద్యములందు గోచరించుచున్నదనియు, కవి కాంతి దర్శకుడనుటకు వీరి పద్యములు సాక్ష్యమిచ్చుచున్నవనియు వక్కాణించిరి. శ్రీ వానమామలై-జగన్నాథాచారి నవరసముల కూడికయే భక్తిరసమనియు, శ్రీ శర్మ శ్రావ్యమగు సమాసముల నుపయోగించినియు, పొల్లులేని పదములతో చొల్లేటివారికి కవిత నడచినదని యుగ్గడించిరి శ్రీ శ్రీ భాష్యం విజయసారథి శ్రీ శర్మ కవిత్వములో పరికరము, కావ్యలింగము, ఉపమ, రూపకాది అర్థాలంకారములు వెల్లువలవని నెలవిచ్చిరి. పిదప అధ్యక్షులు శ్రీ వెంకటేశ్వరు శర్మ వేరు, మనముందున్న కావ్యంలో దాగియున్న శర్మవేరనియు, శతక కవులు ఏ నాలుగవతరగతికి చెందిక ఉత్తమతరగతికే చెందినవారనియు, శ్రీ శర్మ ప్రతిపద్యము భావ గాంభీర్యముగలిగి కవియేగాదు మహాకవియను బిరుదమునకు తగినట్లున్నదనియు మచ్చునకు కావ్యమునుండి కొన్ని పద్యములను ఉదాహరించి చూపిరి.

పిదప శ్రీ శర్మ పండితుల సహృదయ విమర్శనకు కృతజ్ఞతను తెలిపిరి. విద్యార్థి కార్యదర్శి కృతజ్ఞతతో ఈ విద్వద్ గోష్ఠి ముగిసెను.

# మిత్రమండలి - హన్మకొండ

★

## ...త్రి తివారుగారు, M. A.

శతకములో మనోవైజ్ఞానికత, ఆదర్శం ఏమిటో బోధపడలేదు.

## శ్రీ ప్రమోద్ లాలెగారు, M. A.

శతక సాహిత్యములో ఆదర్శం ఏమి ఉండదు. లక్ష్మీనరసింహ యుగళాన్ని పతిత పావనంగా శరణుపొందడమే ఆదర్శము. నరసింహావతారం తాత్కాలికంగా హిరణ్యకశిపుని వధ నిమిత్తం, ప్రహ్లాదుని రక్షించటానికి మాత్రం కలిగినది. అందువల్ల రామకృష్ణ అవతారాలవలె సాంఘికాది సమస్యలు ఆధారాలులేక పోవటము నేరంకాదు. భానుని చండీ శతకంలో ఈలాంటి మనోవైజ్ఞానికత, ఆదర్శం మృగ్యం.

అలంకారాలు సహజంగావచ్చినవి. ఎప్పుడెప్పుడేయే బాధలందుదురో అప్పుడప్పుడా నృసింహస్వామి హృసింహరాశములో నిలుచును. భూమికలో తెలిపిన భావాలు శతకములో రూపొందినవి. స్తోత్రాలలో లక్ష్మీనృసింహ సోత్రమరుదు. కారణమేమంటే రామకృష్ణులంతగా నృసింహస్వామి భక్తప్రియుడు కాడు. కేవలము హిరణ్య కశిపుని వధించుటకెత్తిన అవతారమది. అతిశయోక్తిగాని, పునరుక్తిగాని ఈ పరిమిత ప్రయోజనాని కుద్దేశించఁబడిన అవతారం గూర్చి చేయడం పడదు. కవి లక్ష్మీనృసింహుఁడనే దైవానికి ఆత్మార్పణము చేసికొన్నాడు. తెలుఁగు సామెతలు, జానపద నుడికారాలు, సమాసాలు, సరళంగా ప్రయోగించినారు. లక్ష్మీ నృసింహునకు సంబంధించినంతవఱకు సంస్కృత లక్షణాలన్నీ పుంజుకున్నారు. కవికి దైవముఁదుగల అపార భక్తిభావంవల్ల అమోఘమై అలరారుచున్నది.

## శ్రీ వేటూరి ఆనందమూర్తిగారు, M. A.

శతకం చాల హృద్యంగా ఉంది రసమయంగాఉంది హృదయాన్ని ద్రవీ ... శ్రీ ...నృసింహులుగారు చేశారు. అంతకు

మించి ఎవ్వరుచెప్పలేదు. వస్తువైధన్యము. ఆత్మాశ్రయము రెండు కవితా తెన్నులు. కేవలము మనసులోని భావాల ప్రకటన చేయడమే ముఖ్యమైన ఆత్మిక శాఖ శతకము. శతకము కేవలము ఆత్మనివేదనము చేసికోవడాని కొకా నొక వ్యక్తివ్రాసింది. ఆత్మశోధనలో ప్రకటించుకొన్న భావంలో ఆత్మశాంతి అభ్యుదయం భక్తివిలక్షణాలను నిర్ణయించుకోవడం భౌతికం భక్తివైరాగ్య శృంగార శతకాలున్నవి. శతకాని కాదర్శం అక్కరలేదు. ప్రముఖంగా ఉండాల్సింది నివేదనపూర్వక మైన అనుతాపము. పరమప్రేమ స్వరూపము భక్తి అన్నాడు నారదుడు. భక్తుడు తానే అన్నియై ప్రేమించవచ్చు. ఎన్నిరకాల ఆత్మశోధన చేసికొని ఎదుటివాని వర్ణించవచ్చునో కవి చేయవచ్చు. శ్రీ శర్మగారికి స్వామిమీద ఉన్న భక్తి భావము మనోహరంగా చిత్రించారు. శతకమన్నపుడు పద్యాలెన్నిఉండాల న్నది గూడా భౌతికమే. "ప్రభూ!" అన్న సంబుద్ధియేకాక అనేక సంబోధనలు వచ్చినవి. మకుటం ఒకటే ఎందుకుండాలి? ఏకతాళ గీతాలు విన్నపుడు హరి హరికి తన్మయులమై ఏకాగ్రత సిద్ధించుకొన్నట్లు యాథాయాథ్యమైపోయిన చిత్త వృత్తి భావమందు లయమైపోయింది. కాని లయంచేసి భావ సంపద పద్యంలో ఉన్నప్పుడు మకుటపు పట్టింపులు కూడలేవు. మిగతా బాహ్యాకారణాలన్నీ పఠిత మనసు నాకట్టే ప్రయత్నాలు మాత్రమే. అవి దోహదాలు మాత్రమే డైరీలో Personal Element. ఉన్నట్లు యీ శతక నివేదనలో ఆత్మార్పణ కనిపిస్తుంది. కాని ఆ Element వల్ల సాంఘిక ప్రయోజనంగూడ ఉండాలి ఆయన అను భూతి పఠితల అనుభూతికి సమన్వయించినపుడు తాదాత్మ్యం కలుగుతుంది. కారణం మానవజీవితాలు సాదృశ్యాలు. Personal Element వెనక భక్తి భావం నిండుకొన్నది. తాళ్ళపాకవారి వచనాల్లో భక్తి పరవళ్ళు త్రొక్కింది. వీరి రచనలో 'కుడిచెడి' 'గొల్లెత్తి' లాంటి స్ఖాలిత్యాలు దిద్దుకోవాలి. లగ్నమైన మనస్సు విచ్ఛిత్తి కలగకుండా ఈ పొరపాట్లు దిద్దుకోవాలి. ఇవ్వాళటి ధోరణి మనస్సును State of Confusion వదిలింది. అలజడి మిగిలింది. సాధ్య మైనంత వరకు స్పష్టమైన విమర్శలు రావాలి. నా చిత్తవృత్తిని భక్తిలోకి మరల్చిన శర్మగారికి, మిత్రమండలి వారికి నమస్కారములు.

## శ్రీ ఉదయరాజు శేషగిరిరావుగారు, M. A.

మా యిరువురకు చిరపరిచయముగాన నా ప్రశంస అతిశయోక్తిగా కనిపిం చవచ్చు. 'ఏక నామం సదాప్రీతి' యన్నట్లు ఈతఁడుయోగ్యమైన భక్తుఁడుగా, అతఁడు యోగ్యమైన దైవముగా కనిపిస్తున్నారు. ఆయన కీయన లెంకగనున్నది. నా మీదగల విశ్వాసంతో శతకం పూర్తయ్యాక మొదటికవితాగానము మా ఇంట్లోనే సరస్వతీపటం ముందు జరిగింది. తర్వాత సంస్కృత కళాశాలలో కావ్యగాన మైనపుడు శ్రీయుతులు విశ్వనాథ, చిలకమర్తి, విజయసారథి ప్రశంసించారు. నాకు వారి కవిత్వము ముప్పది సంవత్సరాలుగా పరిచయము. పద్యాలలోపి స్వారస్యం శ్రీ సుబ్రహ్మణ్యంగారే చూపారు. వారి కవనవిధానం చాల అద్భుత మైనది. ప్రతి పద్యానికి వస్తువు సిద్ధం చేసుకొనువారు కొందరు, కొందరు వ్రాస్తుంటే భావం వస్తుందనుకుంటారు. వీరికి లోకానుభవం చాలగొప్పది. ఆంధ్రులకు శతక రచనపై కడుమక్కువ, ఆంధ్రముద్ర ఈ శతకంపై బాగున్నది. సంస్కృతాంగ్లములకన్న ఆంధ్రంలో శతకము లెక్కువ. భిన్న భిన్నరసాలతో శతకములు వ్రాయబడినది భర్తృహరి త్రిశతిలో భక్తి, శృంగారం, వైరాగ్య ములున్నవి. శర్మగారి పద్యాల్లో రాజకీయార్థిక సాంఘిక విషయాలకన్న ఎక్కుడుగా ఆత్మ నివేదన ఉన్నది వారిది కదళీపాకము ఈ విషయము శ్రీ సుబ్రహ్మణ్యంగారు గుర్తించారు. అక్కడక్కడ నారికేళ ద్రాక్షాపాకాలున్నవి. గ్రంథాదిని శ్రీకారము ప్రయోగించిరి. క్రమంగా 3 పద్యాల్లోగూడ శ్రీకారమున్నది గనుక వారికి పతితలకు ముమ్మడిగా శ్రీలు లభిస్తవి. అంతమునగూడ మంగళ మహాశ్రీ ఉపయోగించినారు. చాల సుకుమారమైన నడక. శతకమన్నప్పుడు 108 పద్యములు చెప్పుట ఆచారము. మొత్తముమీద చాల మనోహరమైన రచన. ఇదిక్షుద్రకావ్యంకాదు. మహాకావ్యం.

## శ్రీ ఇరువెంటి కృష్ణమూర్తిగారు, M. A.

శర్మగారి ఆజ్ఞను పాటించి అభిప్రాయమిస్తున్నాను. నాబోటివాళ్ళు కేవ లము అది చదువుకోవలసినవారు. శ్రీ సుబ్రహ్మణ్యంగారు సమగ్రమైన విమర్శ చేశారు. అనుభవం యదార్థమునకెంత దగ్గరగావుంటే శతకమంత శాశ్వత మౌతుంది. మానవునికి బాధలు చెప్పుకోవడం కష్టం. దేవమెట్లు పిలిచినా పలు

కుతాడు. చెప్పుకునే పద్ధతిలో దేశాన్ని కాలాన్ని ఇతిహాసాన్ని అన్నిటినిదాటి ఆత్మ నివేదనం చేసికొంటారు శతక కర్తలు. వేణుగోపాల శతకము చూచిన నాటి సమాజము కనిపించగలదు. వేమన, కవి చౌడప్పల శతకకాలలో సమకాలీన సమాజము చాల బాగా ప్రకటింపఁబడినది. శతకం పాతపడడానికి వీల్లేదు. ప్రత్య క్షానుభవంలేనిది శతకం వ్రాయలేరు. పుస్తకం మానవుని మనోరక్తం అన్నాడు మిల్టను, ఆమాట వీరి శతకంపట్ల సార్థకము. 'విశ్వనాథ విశ్వేశ్వర శతకము' 'గార్లపాటి పరదేవనము' లెంత సునిశితములో ఇది అంత సుందరంగా ఉన్నది.

శ్రీ ఆర్. సత్యనారాయణరావుగారు, M. A.

నే నెక్కువ విమర్శించలేను. ఈ శతకంలో కన్నడ భాషలో మంగప్ప వ్రాసిన శతకంలోగల భావాలు కనబడుచున్నవని మాత్రం చెప్పుతాను.

# పండితచ్ఛందము

★

ఉ॥ ఏశతకంబు కాఁ గమలిపీ శతకంబన నిందుఁగూర్చెఁ బ్రి
జ్ఞాశత వాఙ్మయార్థమధువంభృతమై రసికాళి సంస్తుతి
ప్రాశనపాత్రమై మధుర రమ్య నృసింహవిశాత దీపికా
శ్రీశతకంబనన్ మురువు చెందగఁజేయు నృసింహవత్కవీ !

గీ॥ ఏంప్లుగడచినవార వహేయపాత్రి
చరితుఁడవు నీవు నమరవరాలి వగుట
శతకమిది యొప్పు నీవనుశ్మృతకమునకు
హాఁనెత్తిన పుష్పశతాంజలియయి ॥

గీ॥ పుట్టు గిట్టుల మధ్యలోఁ బూచికొన్న
పూవు పూవున మధువోడ్చి పొదివికొన్న
మాల శతకంబుగాఁగూర్చి మామనోజ్ఞ
బూజఁజేసిన నీ పుట్టు పొగడునొందు ॥

ఉ॥ శిష్టము కైత సదస్రపవిశిష్టమదుష్టము శిష్టగోష్ఠిచే
పృష్టము విష్ణరశ్రీవసుయోగముచేఁ బరిపుష్టమై సదా
హృష్టకవీంద్ర వాగ్రసమయేష్టి సుభృష్టమునై చెలంగుటన్
స్పేష్టియొసంగు నీకును వశిత్వము విందును నందు నెచ్చెలీ !

గీ॥ ఉన్నదున్నటుల్ చెప్పెడి యోగయుక్తి
యేబదేడుల యనుభూతి నెసఁగు రక్తి
నయవినయభక్తి భావనానందభుక్తి
యిహపరంబుల కగుత సాహిత్యశక్తి ॥

— విశ్వనాథ వేంకటేశ్వరులు, ఉ॥ భా॥ ప్ర॥

౧

నీ శతకమ్ము నీ మది జనించిన శోకము రూపమేమొ ఆ
వేశములేక వ్రాసిన కవిత్వమదెట్లు కవిత్వమౌను? నీ
పేశలభావసంపదలు పెట్టిన పేరుగ వన్నెకెక్కె, స
ర్వాశయసిద్ధియుఁ గలుగు యాదగిరీశు కృపావశంబునన్॥

౨

శ్రీచొల్లేటికులాంబురాశిశశి వాసిఁగాంచు నీ పుస్తకం
బాచంద్రార్కము వాగ్వధూటికి సముద్యత్రత్నహారంబు నీ
వాచావైభవమెల్ల శ్రోత్రతలశ్రీనఃపర్వంబుగానొప్పవే?
నా చిత్తం బలరారె ధన్యమతివైనా వింక వేయేటికిన్॥

౩

ఏ సుముహూర్తమందు మొద లీకృతిచేసితొ? ఒక్కచందమై
భాసురలీల సాగినది పద్యమొకొక్కటి పైదితున్కగా
నీ సుకృతమ్ము వాక్సతికి నీయొనరించిన సేవ భక్తి వి
శ్వాసము లేక కాలమున పండెను నిండవె నీ అభీష్టముల్॥

౪

పేదతనమ్మునెంచి విలపించితి దానికి నేను గుంద- నా
వేదన లేక ఇంత సుకవిత్వసుధారసధారలూరునే?
యాదగిరీశు డీదగినదంతయు నీయక ఏమి సేయు నిన్
గాదని యెట్లు ద్రోయియు శ్రితకామఫలప్రదుఁ డాతఁడైనచోన్॥

౫

చెప్పనేటికి పెక్కు నృసింహశర్మ
పుట్టినందుకు కైత చేపట్టినందు
కందగలిగితి దానికైనంతఫలము
చాలు నీవంశవృద్ధియై మేలు కలుఁగు॥

హన్మకొండ 3-2-'60

— గార్లపాటి రాఘవరెడ్డి

క॥ అల్లికజిగి, నుడి తేనియ
జల్లును, రాజిల్ల యాదశైల నృహరిపై
నల్లిన శతకముగాంచితి
చొల్లేటి నృసింహశర్మ సుకవివతంసా !

కి॥ శతకంబునఁబ్రతి పద్యము
చతురతతో నిర్వహించి శతకకవులలోఁ
బ్రతిభ వెలార్చితి వీస్తుతి
కృతియొక్కటి చాలు నీకుఁ గీర్తిగడింపన్ !

క॥ అలితములగు భావంబులు,
పలుతెగలను కల్పనములు, పద్యంబులలో
నలరిచి కవితాప్రౌఢిమ
నెలవగు శతకమ్ము వ్రాయ నేర్చితివి ఔరా !

క॥ సరసుఁడవు నీవు మిక్కిలి
సరసము నీ కైత యాంధ్రసారస్వతమం
దరుదుగ నీవంటి కవీ
శ్వరులుందురు వారు సుకృత జన్ములు సుమ్మీ !

హన్మకొండ 1-3-'60 — శ్రీమాన్ దూపాటి వేంకటరమణాచార్యులు,
శతావధానులు

ఉ॥ చక్కని పద్యరూపమున సారతరంబగు భక్తిగూర్చి పే
రక్కఱమై నృసింహు గొనియాడితి యాదగిరీశు సన్నుతిన్
పెక్కుకవిత్వధోరణుల పెంపెసలార సుధీందుబ్రిలుబ్బగా,

## 9

క॥ మేదుర ధారాశుద్ధియు
సాదర భావప్రపంచసారము రీతి
ప్రాదుర్భావము బహుళర
సోదయమై నీ కవిత్వ మొప్పు నృసింహా!

తే॥ గీ॥ కుంటుపదమొక్కటెక్కడ కూడలేక
లలిత పద భావగాంభీర్య కలనచెంది
యమల కావ్య గుణమ్ము సఖ్యమ్ము జేసి
పరగు నీ కవితాకన్య ప్రౌఢనాఁగ!

క॥ శతక కవిత్వంబనగా
పతితాత్మకు లీసడింత్రు: పండితవరులో
నుతి సేతురు చేతోమో
దతత్పరత సారభావ తాత్పర్యమునన్!

ఉ॥ ఇంబగు పల్కులన్ మృదువులీనెడు సారరసైక సత్సమా
సంబుల, భావగర్భిత విశాలత నొప్పెడు కావ్యపంక్తులన్
బంబిన భక్తిగూర్చితి సెబాసన, శ్రీనరసింహుఁగూర్చి, చి
త్రంబు! నృసింహ నీ కవిత తద్దయు నిగ్గులుదేరె నీ కృతిన్!

ఆ॥ వె॥ చొక్క కవిత వ్రాయు చొల్లేటి నరసింహ!
ఆటవెలఁదివిత్తు హాస్యమునకు
శతకరమణి గూడి సరసోక్తులాడంగ
మిత్రభావమూని మేలుకొనుము!

6-3-1960 } బ్రి॥ శ్రీ గొట్టుముక్కల రాధాకృష్ణార

ఉ॥ చిత్రి విచిత్రి భావములు చేకుర భావ సమాన భాష స
ర్వత్రి వెలుంగ, సుందరతరంబగు కైత రచింతు వెంతయుఁ
బాత్రముగాఁగ. పండితులు పామరులుఁ నిను సంతతంబు సం
స్తోత్రము సల్పుచుండెదరు చౌల్లెటి శ్రీనరసింహ సత్కవీ!

చ॥ నవరస భాసురంబగు సనాతన పండిత వాగ్విలాసముఁ
నవకవి భావమంజులిమ నానుడియై తనరారె నీకు మా
ర్దవమున మాధురిఁ వెలయు తావకధోరణి చిత్రమయ్యె నీ
కవనపటుత్వముం గుకవికాండభయప్రదమై తనర్చెదుఁ.

ఉ॥ పెట్టని భూషణమ్ములయి పేరువహించును పద్యయోషికిం
పట్టపురాణియై తనరు భామకు నీకృతి రత్నజాలముల్
పట్టిన నీవు గూర్పు పదపంక్తులు తన్మహిళా పదాబ్జ సం
ఘటిత నూపురధ్వనుల కైవడి శ్రావ్యములై విధాసిలుఁ.

పవిత్రంబు చౌల్లేటి వంశంబు తద్దు
గ్ధ వారాశియందుఁ సుధాధాముఁడై యు
ద్భవించెఁ నృసింహాఖ్యుండు భవ్యుండు విద్వ
త్కవిస్తుత్య గంభీరకావ్యుండు ధాత్రిఁ.

అనేక ప్రకారంబు లాతండు విద్వ
జ్జనస్తుత్య సాహిత్య శాఖోపశాఖా
ఘనారామవాటీ పికస్వామియై మం
జునాదంబు గానించు శోకంబుడిందఁ.

సుధీతోషణుండై యశోభూషణుండై
సుధాభాషణుండై రజోదూషణుండై
విధేయత్వ విద్యాకవిత్వస్వభావ
పవిత్రుఁ శ్రీ నృసింహాఖ్యుండు వరిలు భూమిఁ.

11

మహోదారమై భాసమానాలయంబై
మహీయః ప్రతిష్ఠానమానంబునై నీ
కహో! సాహితీసేవ యబ్బెన్ నృసింహా!
మహీదేవ సింహా! నమస్తే! నమస్తే!

శ్రీ రాజకవి చూడామణి
ఉదయరాజు శేషగిరిరావు, M. A.



[illegible] గారి రచితములు.

ముద్రితములు :—

1. లక్ష్మీనరసాంబ జీవిత చరిత్ర
2. బదరీ కేదారయాత్రా గైడు
3. కోదండరామ శతకము
4. గాంధీ శతకము
5. భిషగ్విజయ నాటకము (అనువాదము)
6. తోడు
7. నీడ
8. గేయమాల
9. కవితామంజరి
10. నా ప్రియా!

అముద్రితములు.

1. ఆణిముత్యము— నవల (18 పేజీలు ముద్రితము)
2. నేటి తలంపు (గాంధీ వాణి
3. స్వధర్మము మహారాష్ట్రానువాదము)
4. శతనీతి గీతములు
5. కవితోద్యానము (చాటువులు)
6. [illegible] పత్రికలందు (ప్రచురితమైన వ్యాసములు)
7. పాలమీగడ (చాటువులు)
8. కవి సమ్మేళనము
9. హృద్వీణ (గేయములు)
10. శంకర విజయం (ద్విపద కావ్యము— అసంపూర్ణము)
11. పిలగూని గంప

ప్రతులకు :—

గాన విశారద శ్రీ కె. ముకుందం, టీచర్,
ఏనుగుల గడ్డ, H. No 3/280 హన్మకొండ (వరంగల్)

శ్రీమతి శాంతాబాయి, టీచర్,
గర్ల్స్ మిడిల్ స్కూల్, మంథెన (కరీంనగరము జిల్లా)



కవి పరిచయము:

పేరు: బ్ర॥ శ్రీ [illegible] నృసింహశర్మగారు

జన్మస్థానము: [illegible]హాపురము. తా॥ జనగామ. జి॥ వరంగల్.

ప్రస్తుత నివాసము: కంచరకుంటవీధి హనుమకొండ. (ఓరుగల్లు)

రచనలు: ఇప్పటి వరకు **21.** అందు **10** పుస్తకములు ముద్రితములు. **11** అముద్రితములు— ఇందు శతకములు. చరిత్రలు. నాటకములు. గేయములు. చాటువులు. నవలలు మొదలయినవి గలవు

పాండిత్యము: శ్రీ శర్మగారికి ఆంధ్రాంగ్లతురుష్క భాషలలో పాండిత్యముగలదు. ఆంధ్రోపాధ్యాయ వృత్తినుండి మొన్న మొన్ననే రిటైరైనారు.

కవితాశైలి: పండిత పామరవర్గానికి అందుబాటులో నుండే విధంగా ధారాళంగా ఉంటుంది.

లక్ష్యము: సారస్వతసేవ— ధర్మమార్గము.